




మార్చి
1994

# వైశ్యప్రబోధిని

తెలుగు మాస పత్రిక


శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి దేవి

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్

హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించవలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

| | | |
|---|---|---|
| నిచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి | | మేడా నరసింహులు శ్రేష్ఠి |
| అధ్యక్షులు | V.P.- A5 | ప్రధాన కార్యదర్శి |

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్యాన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం
✆ : 62
ప్రకాశం జిల్లా.

బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం
✆ : 3158 (S.T.D. 085195)
కర్నూలు జిల్లా.

అక్షయ మహారాజ పోషకులు : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంకిలలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫోటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రూ.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆరోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో సత్రావరణములో పెట్టబడును.

రూ.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

భోజనశాల, ప్రార్థనా మందిరము, కళ్యాణ మంటపము, గోశాల, సమావేశ భవనముతో కూడా 109 వసతి గదులు గల ఈ సత్రము ఆదర్శవంతంగా నిర్వహించబడుచూ, నిత్యాన్న దానము చేస్తున్నదని తెలియజేయుటకు సంతోసిస్తున్నాము.

రాష్ట్ర, రాష్ట్రేతర పుణ్యక్షేత్రాలలో నిర్వహింపబడుచున్న నిత్యాన్నదాన సత్రాలకు ప్రతి ఏటా ఒకటి లేక రెండింటికి రూ.50,000/-ల నుండి రూ.1,00,000/-ల వరకు ఆర్థిక సహాయము అందించాలన్న తీర్మానము సర్వసభ్య సమావేశముచే ఆమోదించబడినందున ఈ సత్రమునకు ఆర్థిక సహాయం చేసిన దాతలు పరోక్షముగా రాష్ట్ర, రాష్ట్రేతర పుణ్యక్షేత్రాలలో నిర్వహింపబడుచున్న నిత్యాన్నదాన సత్రములకు కూడా దానము చేసినవారు ఔతారు.

పై మూడు పద్ధతులలో ఏదో ఒక పద్ధతిన ఈ అన్న సత్రమునకు ఆర్థిక సహాయాన్ని అందించి దైవ కృపకు పాత్రులు కమ్మని సోదరులకు విజ్ఞప్తి చేస్తున్నాము.

అన్నా సుబ్బ రంగయ్య
కార్యదర్శి

పోలిశెట్టి సత్యనారాయణ
అధ్యక్షులు

వైశ్య ప్రబోధిని
( మాసపత్రిక )
స్థాపితము
1969



సంపుటి
25



సంచిక
7



మార్చి-1994



సంపాదకులు :
'సంఘోద్ధారక',
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతంశ్రేష్ఠి



ప్రాప్తిస్థానం
ఫోన్ : 45025
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్ "
జయనగర్ కాలని,
విద్యామందిర్
తూ॥ భాగం
కడప - 516 002.


సంపాదకీయం

# భారం లేని బడ్జెట్

భారత ప్రభుత్వ ఆర్థిక శాఖామాత్యులు శ్రీ మన్మోహన్ సింగ్ *28.2.1994*వ తేదీన పార్లమెంట్‌లో ప్రవేశ పెట్టిన *1994-95* సాధారణ బడ్జెట్ సామాన్య ప్రజల జీవన వ్యయ స్థాయిని ఆయన చక్కగా అవగాహన చేసుకున్నారన్న అంశాన్ని స్పష్టపరుస్తూంది.

పన్నుల భారం పైసా పడినా భరించలేని స్థితి యీనాటి భారత దేశంలోని సామాన్య ప్రజల స్థితి.

ప్రభుత్వమునకు అవసరమైన ఆదాయాన్ని ధరల పెరుగుదలకు దోహదమిచ్చే విధంగా పన్నుల శాతాన్ని మరింతగా పెంచడమే లక్ష్యంగా ఇంతకు మునుపటి ఆర్థిక మంత్రులు అనుసరించే పద్ధతి. మన్మోహన్ సింగ్ ఈ పద్ధతికి పూర్తిగా స్వస్తి చెప్పడం అభినందనీయము.

మన్మోహన్ సింగ్ ప్రవేశ పెట్టిన *1994-95* సాధారణ బడ్జెట్ వల్ల ఏ వర్గం మీద భయపడాల్సినంత బరువూ పడలేదు. ప్రతిపక్షాలు, ప్రజలు భావించినంత మేలు జరుగక పోవచ్చు కానీ ఏ వర్గానికీ ఇబ్బంది కలిగించని బడ్జెట్ ఇది.

జీవిత బీమా మినహా ఇతర బీమా సంస్థలు చేస్తున్న సేవల మీద, టెలిఫోన్ సర్వీసుల మీద, స్టాకు బ్రోకర్స్ సర్వీసుల మీద ఐదు శాతం పన్నును విధించడం అంతగా అభిలషణీయం కాక పోయినా, ఆందోళన కలిగించే విషయం కాదు. పరిమళ ద్రవ్యాల మీద మునుపుగల పన్నును ఈ బడ్జెట్ లో తగ్గించడము, ఫిల్టర్ సిగరెట్ల మీద ఇది వరకూ గల

సుంకాన్ని పం(దెండు శాతం పెంచడము ఈ బడ్జెట్‌లో గమనించాల్సిన మరో అంశము. స్థూల దృష్టికి ఇది కొంత భారంగా కనిపించినా సూక్ష్మంగా ఆలోచించినపుడు ఎవరిపైనా అంత భారం పడదు.

ఇంతకు మునుపు గల ముప్పై వేలుగా ఉన్న ఆదాయపు పన్ను విధింపు పరిమితిని ఈ బడ్జెట్‌లో ముప్పై ఐదు వేలకు పెంచారు. ఇది పరిమిత ఆదాయ వర్గాల వారికి కొంత ఊరట కల్గించే అంశమే. అయితే ఈనాటి ప్రజల జీవన వ్యయమూ, వినియోగ వస్తువుల ధర స్థాయినిబట్టి ఆలోచించినపుడు, ప్రతి పక్ష్యాలు కోరే విధంగా యాభై వేలకు పెంచి ఉంటే అన్ని వర్గాల వారికి మరింత ఆనందాన్నీ, హర్షాన్నీ కలిగించి ఉండేది. వృద్ధ పింఛనుదారులకు కల్పించిన రాయితీలు కూడా ఆ వర్గాల వారికి కొంత సంతోషాన్ని కలిగిస్తాయి.

బడ్జెట్‌లో వివిధ పద్దుల క్రింద కేటాయించిన నిధులను పరిశీలిస్తే గ్రామీణ ప్రాంతాల అభివృద్ధిని త్వరిత గతిని సాధించుటకూ, ఉపాధి అవకాశాలను మెరుగు పరచడానికీ కేటాయించిన నిధులు గత సంవత్సరం కంటే ఎక్కువగా కన్పిస్తాయి. స్వయం ఉపాధి వర్గాలకు యూనిట్ ట్రస్టు ద్వారా పింఛను పథకాన్ని అమలు జరపాలన్న ఈ బడ్జెట్‌లోని ఆర్థిక మంత్రి ఆలోచన అభ్యుదయ కరమైనదిగా భావించవచ్చు.

ఎరువుల మీద, ఆహార పదార్థాల మీద ఇంత వరకు ఉన్న 'సబ్సిడీ' లను రద్దు చేస్తారని చాలా మంది భావించారు. ఆర్థిక మంత్రి అందుకు విరుద్ధంగా వాటిని యధాతథంగా కొనసాగించడం జరుగుతుందని ప్రకటించడం సామాన్య ప్రజలకు ఆనందాన్ని కలిగించే అంశము. అట్లే వ్యవసాయాదాయముపై పన్ను వేసే సాహసం చేయక పోవుట ద్వారా ఆర్థికమంత్రి అభినందనీయులయ్యారు.

ఈ బడ్జెట్‌లో ఆందోళన కలిగించేది ఆరు వేల కోట్లకు చేరుకున్న బడ్జెట్ లోటు. అయితే ఈ లోటును ఆరు వేల కోట్లకు మించనివ్వము అన్న హామీని ఆర్థిక మంత్రి నిలబెట్టుకొంటే ఈ లోటు వల్ల ఒడిదుడుకులు ఉత్పత్తి కాక పోవచ్చు. బడ్జెట్ ప్రతి పాదనలను హేతు బద్ధంగా ఆలోచించినపుడు మన్మోహన్ సింగ్ ఆదాయానికీ – వ్యయానికీ మధ్య సమతుల్యం పాటించినట్లు ఋజువు అవుతుంది.

# "మహనీయుడు" శ్రీ శికాకొల్లు సుబ్బారావు

*(ప్రముఖ పారిశ్రామిక వేత్తల్యూ, మధుర మనస్కుల్యూ, మంచిని సర్వదా పంచిపెట్టే మానవతా వాదీ శ్రీ శికాకొల్లు సుబ్బారావు గారు. కష్టాలు కొండలై పైబడ్డా చలించని, వెఱపెరుగని గుండె బిగువు గల శ్రీ సుబ్బారావు గారు 20.2.1994వ తేదీన స్వర్గస్థులయ్యారు. 13.2.1994వ తేదీన వీరి స్వగ్రామం, ప్రకాశం జిల్లాకు చెందిన సింగరాయకొండలో వీరి సంస్మరణ సభ జరిగింది. ఈ సభకు కావలి జవహర్ భారతి కళాశాల మాజీ ప్రధానచార్యులు శ్రీ యస్.వి. భుజంగరాయశర్మ గారు అధ్యక్షత వహించారు. వీరి కోడలు శ్రీమతి లక్ష్మీ మోహన్ ఈ సభలో చేసిన ప్రసంగ వ్యాసమే ఇది. – సంపాదకులు)*

మహోమహనీయులు మా మామ గారు కీర్తిశేషులు శ్రీ శికాకొల్లు సుబ్బారావు గారు. ఆయన 20.1.94న పరమపదించి నారు. ఈ సందర్భంగా ఏర్పాటు చేయ బడిన ఈ సంస్మరణ సభలో మాట్లాడ టానికి అవకాశము వచ్చినందుకు నేను అదృష్టముగా భావిస్తున్నాను. ఈనాడు ఆయన తన జీవితంలో సాధించిన ఎన్నో ఘన విజయాలను గురించి మనం ఘనంగా చెప్పుకొనడానికి ఈనాడీ సభ ఏర్పాటు చేయబడింది.

అసలు ఇలాంటి సంస్మరణ సభలను ఎందుకు మనం ఏర్పాటు చేసుకుంటాం? అందరికీ తెలిసిన విషయం అది.

మహాత్ములు, ఉత్తమ పురుషులు మరణించినా జీవించివున్నట్లే. వారు అమరులు. అలాంటి వారి గురించి వారు ఎందరికో చేసిన సేవలను గురించి, వారు సాధించిన ఎన్నో విజయాలను గురించి, వారు నెరపిన ఎన్నో మంచి పనులను గురించి మనం అందరం ఒకసారి అవన్నీ గుర్తుకు తెచ్చుకొని ఇలాంటి సభల్లో స్మరించుకొన్నప్పుడు మనలో ఏ కొందరి కైనా, ఏ కొంత అయినా మనసులో ఇలాంటి మంచి పనులు మనం కూడా ఎందుకు చేయకూడదు అనుకొనుట సంభవించునని ఆశించి ఇలాంటి సభలను ఏర్పాటు చేసుకోవడం జరుగుతుంది.

అన్ని జన్మలలో కెల్ల అత్యున్నత జన్మ మానవజన్మ. అలాంటి మానవ జన్మలో ఏ కొందరో ఉత్తములుగా జన్మించి మహనీయులుగా గుర్తించబడు తున్నారు. ఆ కొందరిలో పూజ్యనీయులు మా మామగారు శ్రీ శికాకొల్లు సుబ్బారావు గారు.

వీరు 1924 సం.లో సింగరాయ కొండలో మధ్య తరగతి కుటుంబంలో జన్మించారు. వీరికి 5 సం.ల వయస్సులో వీరి తండ్రి గారైన శ్రీ శికాకొల్లు చంద్రమౌళి గారు కాలధర్మం చెందారు. వీరు వారి తాతగారైన కీర్తిశేషులు శ్రీ శికాకొల్లు లక్ష్మయ్య గారి చేతుల్లో తీర్చి

దిద్దబడ్డారు. వీరి తాతగారు చాల ధర్మ, గుణశీల సంపన్నులు, చాలా తెలివి, ధైర్యం కలవారు. మెత్తని హృదయం కలిగిన ప్రేమ స్వరూపులు. ఎంతో క్రమశిక్షణ గలవారు. అటువంటి వారి చేతుల్లో వీరు ఎంతో చక్కగా పెరిగి పెద్దవారు అయ్యారు.

మా మామగారి స్కూల్ విద్యాభ్యాసం కొత్తపట్నం, ఒంగోలులో జరిగినది. వీరు స్కూలు ఫైనల్ వరకు చదివారు. వీరికి ఉన్నతాభ్యాసం లేకపోయినా మహాను బావులు, పండితులు, బహుముఖ ప్రజ్ఞా వంతులు. వీరు ఎన్నో మహా గ్రంథాలను, విజ్ఞాన పుస్తకాలను, వాస్తు హస్త సాముద్రికా శాస్త్రాలను అధ్యయనం చేశారు. చాలా జ్ఞాపకశక్తి కలవారు. తాను తెలుసుకున్న విషయాలను చక్కగా జీర్ణించుకొని ఎదుటి వారికి చక్కగా చెప్పగలిగిన మహా మేధావి. అభ్యుదయ భావాలు కలిగినవారు. హేతువాది. మానవత్వమే దైవత్వమని నమ్మినవారు. ఆయన కవి కూడా. కాని ఆయన కవితలు గ్రంథస్తము కాలేదు. అందువలన వెలుగు చూడలేదు.

వీరు బాల్యం నుండే దేశ స్వాతంత్ర్య ఉద్యమాల పట్ల చాలా ఆసక్తి కలవారు. తరువాత వీరు చదివే స్కూలులో వసతులు సరిగ్గా లేనందున స్టూడెంట్స్ ఫెడరేషన్ కమిటీ ఏర్పరచుకొని సరైన న్యాయం కోసం స్కూల్ లో పోరాటాలు జరిపారు. అటువంటి సమయములో శ్రీ గుజ్జుల యలమందా రెడ్డి గారు పరిచయం అయ్యారు. వీరి ద్వారా ఆయనకు సోషలిస్టు భావాలు ఏర్పడినాయి. (శ్రీ గుజ్జుల యలమందారెడ్డి గారు భారత కమ్యూనిస్టు పార్టీలో మెంబరుగా వుండి ఇప్పుడు సి.పి.ఐ. ఆల్ ఇండియా, భారత వ్యవసాయ కార్మిక సంఘానికి అధ్యక్షులుగా ఉన్నారు).

శ్రీ యలమందారెడ్డి గారితోనే కాకుండా మా మామగారి బంధువు, ఆప్తులు అయిన గద్దర్ వీరుడు శ్రీమాన్ దర్శి చెంచయ్య గారి ప్రభావం కూడా వీరిపై చాలా వుంది. శ్రీ దర్శి చెంచయ్య గారు స్వాతంత్ర్య యోధుడు, సాంఘిక సంఘ బహిష్కరణకు వ్యతిరేకంగా అంట రానితనాన్ని, కులమత భేదాలు వుండ కూడదని, మానవులంతా సమానులని గుర్తించి వారి కొరకు పోరాటం సాగించిన వారు.

మా మామ కూడా వారి ఆశయాలను గౌరవిస్తూ వారి ఉద్యమ పోరాటాల పట్ల ఆకర్షితులై అలాంటి మనస్తత్వాన్ని అవ వరచుకొని వారు ప్రతిదినం స్కూల్ వదలగానే వారి మీటింగుల్లో పాల్గొనేవారు. నెమ్మదిగా ఉద్యమాల పోరాటం సాగించ డం ప్రారంభించారు. సామాన్య మానవుల కోసం పోరాటం సాగించారు. కొంతకాలం తరువాత పెద్దల ఒత్తిడిపై వివాహం చేసు కున్నారు. మా మామగారి అత్తగారు కీ.శే. శ్రీమతి కట్టారాఘవ శంకరయ్య గారు కూడా స్వాతంత్ర్యసమర యోధులు, ఉప్పు సత్యాగ్రహము నందు పాల్గొని బ్రిటిషువారి పాలనను నిరశించి నిరాహార దీక్షలలో పాల్గొని, జైలుకు కూడా వెళ్ళారు. అటువంటి అభ్యుదయ కుటుంబం నుండి వచ్చిన వ్యక్తిని భార్యగా పొంద గలిగారు. అటుపిమ్మట వారి తాత

గారు స్థాపించిన ఆయిల్ మిల్లులో ఆయన వద్ద వ్యాపారం నేర్చుకొని సంసార బాధ్యతలను స్వీకరించి ఇతరులకు సహాయము తనకు సాధ్యమైనంత వరకు చేస్తూ వచ్చారు. ఆయన కమ్యూనిష్టు పార్టీలో సభ్యుడిగా ఉండకపోయినా సానుభూతి పరుడిగా ఎంతో గొప్ప విరాళాలు అందజేసేవారు. ఆయన చనిపోయే నాటి వరకు విరాళాలు ఇచ్చి కంటికి రెప్పలా పార్టీని కాపాడినారు.

1948లో ఏర్పాటైన సింగరాయకొండ పంచాయితీకి తొలి అధ్యక్షుడిగా ఆయన ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఇక్కడ ఉన్నత పాఠశాలల ఏర్పాటుతో పాటు పక్కా భవనాల నిర్మాణంలో ఆయన పాత్ర ప్రముఖమైనది. అయితా రామయ్య శ్రేష్టి, గడ్డం వీరరాఘవయ్య ప్రభుత్వ జూనియర్ కళాశాలలో ఈయన తల్లి పేరుతో అదనపు భవనం నిర్మించారు. స్థానిక కళ్యాణ నిలయం నిర్మాణానికి తోడ్పడ్డారు. ఆ తర్వాత రైసు మిల్లు, ఆయిల్ మిల్లు నడిపించారు. విద్యుత్తు శాఖలో టవర్ లైన్స్ కాంట్రాక్టరుగా పలు లైన్లు నిర్మించారు. నెల్లూరు జిల్లా టుబాకో గ్రోయర్స్ క్యూరర్స్ మార్కెటింగ్ కో-ఆపరేటివ్ సంఘానికి కార్యదర్శిగా ఎన్నికై రెండు దఫాలు ఆరేళ్లపాటు పదవి నిర్వహించారు. రాష్ట్ర ఆర్య వైశ్య మహాసభకు 1977లో ఉపాధ్యక్షుడిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. 1967లో ఎ.పి.టుబాకో సీడ్ ఆయిల్ అసోసియేషన్‌కు కార్యదర్శిగా ఎన్నికయి 13 సం.ల పాటు ఆ పదవితో ఉన్నారు. 1973-76 వరకు టుబాకో ఎక్స్‌పోర్ట్ కూడా చేశారు. వారు ఎన్నో సంవత్సరాలుగా కన్నకల 1986లో ఫలించినది. వారికి మొదటి నుండి ఒక పెద్ద (ఫ్యాక్టరీని) కర్మాగారాన్ని నిర్మించి ఎందరో నిరుద్యోగులకు జీవనోపాధి కలిగించవలెనని అనుకుంటూ ఉండేవారు. అదే ఈనాడు జగ్గయ్యపేట సమీపంలో రామాపురంలోని కోరమాండల్ సిమెంట్స్ లిమిటెడ్. దానికి వారు 8 సంవత్సరముల పాటు యం.డి.గా వ్యవహరించారు. ఆ ఫ్యాక్టరీ కొరకు ఆయన చాలా శ్రమపడినారు. ఫ్యాక్టరీ నష్టాలలో ఉన్నప్పుడు కూడా లెక్క చేయక కార్మికులకు ఎటువంటి లోపం జరగకుండా చూస్తూ ఎటువంటి సమ్మెలు జరగకుండా ఎంతో మంచి పేరును, కీర్తిని సంపాదించుకున్నారు. కార్మికుల కుటుంబాలకు కూడా ఎన్నో గుప్తదానములు చేసారు.

వీరు విద్యకు ఎక్కువగా ప్రాముఖ్యతను యిచ్చేవారు. కొంతకాలం హైదరాబాద్ లోని వాసవి ఎడ్యుకేషనల్ అకాడమీ ఉపాధ్యక్షులుగా ఉంటూ అక్కడ వాసవి ఇంజనీరింగ్ కాలేజి స్థాపనకు ప్రముఖపాత్ర వహించారు. అలాగే వాసవి పబ్లిక్ స్కూలు, వాసవి 'లా' కాలేజి, వాసవి మానేజిమెంటు స్కూలు స్థాపనకు కూడా ఆయన కృషి చేసారు. ప్రకాశం జిల్లాలో ఆయన డోనేషన్ యివ్వని కాలేజి అంటూ బహుశా లేదు. ఎంతోమంది విద్యార్థులకు మెడికల్, ఇంజనీరింగ్ కోర్సులకు కూడా సహాయపడినారు. ఎన్నో గుప్తదానాలు చేసారు. కొన్ని కుటుంబాలకు కూడా

గుప్తదానములు చేసారు. ఒంగోలులో ఎత్తైన పీఠాన్ని ఏర్పరచి, ప్రతి సంవత్సరం ఎందరో కవులకు సన్మానములను జరిపించినారు.

తరువాత వీరు కమ్యూనిష్టు పార్టీలోని పాత స్నేహితులను మరచిపోకుండా వారితో సత్ సంబంధాలను కలిగివుండి, వారి అమూల్యమైన సలహాలను ఇస్తూ పార్టీకి విరివిగా విరాళాలను అందచేసేవారు. వారి సమకాలికులు భారతకమ్యూనిష్టు నాయకులు శ్రీ సవడా రెడ్డి గారు, శ్రీ కాశీరెడ్డి గారు ఈయన చనిపోయే నాటి రవకు ఆయన సహచరులుగా ఉంటూ (వారి తరపున వీరు) పార్టీకి సేవలను అందజేస్తూ వచ్చారు. వీరికి ఒక్క విషయములో చాలా విచారం ఉండేది. 1964లో కమ్యూనిష్టు పార్టీ చీలిపోవడం ఈయన మనసునెంతో గాయపరచింది. ఎప్పుడూ అందరు కలసి ఐకమత్యంగా పార్టీ మనుగడకు అహర్నిశలు ఆలోచిస్తూ తన అమూల్యమైన సలహాలను ఇస్తూ ఇరు పార్టీలను కలపడానికి ప్రయత్నించే వారు. కమ్యూనిష్టు పార్టీలో వర్తక సంఘాలతో కూడా సత్ సంబంధాలు కలిగి ఉండాలని కోరేవారు. చిన్నకారు రైతులు, చిన్న చిన్న వ్యాపారస్తులు ఇలాంటి వారిని కూడా కలుపుకొని వారికి కూడా సహాయ సహకారాలను అందజేస్తూ మంచి కొరకు అందరు ఐకమత్యంగా ఉండాలని పార్టీకి ఎవరు దూరం కారాదనీ భావించేవారు. అందరు సమానమే, మార్క్స్ సిద్ధాంతం కూడా అదేనని చాటి చెప్పేవారు. అందరితో కలసి పనిచేసి ఎన్నో విజయాలను సాధించారు. మన తాలూకాలో కూడా అందరు కలిసి ప.పిచేసేట్టు చేయగలిగారు.

అందరు శ్రీ దర్శి చెంచయ్య గారిని మరిచిపోతున్న తరుణంలో ఆయనను ఎవరు మరచిపోకుండా వారి కీర్తిని వెలుగు లోనికి తీసుకురావటానికి వీరు పార్టీ ప్రముఖులైన ప్రకాశం జిల్లా కమ్యూనిష్టు కార్యదర్శి శ్రీ నల్లూరి వెంకటేశ్వర్లు గారు, ఒంగోలు బార్ అసోసియేషన్ శ్రీ కరవాది వెంకటేశ్వర్లు గార్లతో సంప్రదించి మరి కొంతమంది పెద్దలను సంప్రదించి వారి సహాయము కూడా తీసికొని షుమారు రు.50,000/-లు వరకు ఖర్చుపెట్టి ఒంగోలులో తాతా చినకన్నయ్య గారి బిల్డింగులో ఫంక్షను జరిపినారు. ఆనాటి సభకు ఎందరో ప్రముఖులను రప్పించి ఉపన్యాసాలను ఇప్పించినారు. వారిలో ముఖ్యులు స్వాతంత్ర్యసమర యోధులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య గారు, శ్రీ కీ.శే. పెండేకంటి వెంటక సుబ్బయ్య గారు (వీరు కొంతకాలం హోం మినిష్టరుగా కూడా పనిచేశారు.) శ్రీ దర్శి చెంచయ్య గారి శత జయంతిని జరిపించి జీవిత చరిత్రను ప్రింటు చేయించి పుస్తకాలను కూడా అందరికి పంచి, వారి కీర్తిని పెంపొందింప చేశారు.

చివరికి వీరు కన్నకలలు 30 సంవత్సరాలు తర్వాత ఫలించినవి. 1964లో విడిపోయిన సి.పి.ఐ., సి.పి.యం. ఉభయ పార్టీలు మళ్ళీ 1994వ సంవత్సరం ఫిబ్రవరి 4వ తేదీన చేతులు కలిపాయి. 30 సంవత్సరాలు ఆయన ఎదురు చూచి

పార్టీ కలయిక ఆయన కర్మ క్రియలు జరిగిన రోజే విజయవాడలో 10 లక్షల మందితో జరిగింది. ఆ సభలో అనేక మంది మృతవీరులు కోరికఫలించినందుకు వారి ఆత్మశాంతి కొరకు వీరుల అమరత్వాన్ని, త్యాగాన్ని కొనియాడారు. వీరి ఆత్మ ఎక్కడ వున్నా ఇది తప్పక చూచి ఆనందించి ఉంటుంది.

వారు చివరిసారి శ్రీ నవడా రెడ్డి గారితో ఇలా అన్నారు. "నేను జీవించి వున్నా లేకున్నా నా మనస్సు ఈ పార్టీ గురించి ఆలోచిస్తూనే ఉంటుంది. నా మనశ్శాంతి కోసం నీవు కూడా చివరి వరకు ఈ పార్టీని విడువరాదు, మరువరాదు" అన్నారు. వీరు ఆ పార్టీకే కాకుండా మిగతా పార్టీలకు అన్నింటికీ కూడా తన సహాయ సహకారాలను అందించారు. కుటుంబపరంగా చూచిన వీరు అందరిపట్ల ఎంతో ఉదారంగాను, దయతోను వ్యవహరించేవారు. ఒక భర్తగా అనుకూలవతియైన సహధర్మచారిణి యొక్క పూర్తి సహకార సంపత్తితో తన నిండైన జీవితాన్ని సంతృప్తిగా జీవించిన ధన్యులు. ఒక సోదరుడిగా, ఒక తండ్రిగా, ఒక మామ గారిగా, ఒక తాతగారిగా తన ప్రేమానురాగాలను పంచి ఇచ్చారు. వారు "కోడలు-కూతురు" అని గాని, "కొడుకు-కోడలు" అని కాని, ఎన్నడు, ఎలాంటి వ్యత్యాసాన్ని చూపించ లేదు.

. ఇలాంటి గొప్పవారు ఎందరో యువకులకు ఆదర్శప్రాయులై ఉన్నారు. చిన్న వయసు కలిగిన ఎందరో యువకులు ఆయన వద్దకు వచ్చి ఎన్నో విషయాలను చర్చించి వెళ్ళేవారు. ఎన్నో విషయాలను తెలుసుకొని పార్టీ సక్రమంగా నడవడానికి కృషి చేసేవారు. నిజంగా దేశానికి మన వంతు సేవలను ఏ కొంతైనా, ఏ రూపంగానైనా చేయగలిగిన నాడు ఈ దేశం మళ్ళీ సస్యశ్యామలం కావడం, ముమ్మాటికి నిజం. బాపూజీ కలలు నెరవేరటం ఎంతయినా నిజం.

మా మామ గొప్ప విద్యావేత్త, విద్యాదాత, వినయ సంపన్నుడు, అభ్యుదయ వాది, దానశీలి, ధైర్యశాలి, ప్రేమ స్వరూపులు, మేధావి, హేతువాది, విజ్ఞానఖని, సోషలిస్టు, దేశభక్తుడు, పారిశ్రామిక వేత్త, వ్యాపారవేత్త, రాజకీయ పారంగతుడు, కార్మిక శ్రేయోభిలాషి ఇన్ని అసాధారణ విషయములన్ని ఒక వ్యక్తిలో మూర్తీభవించి వుండుట అసాధారణము. అద్భుతము. అందుకే ఆయన మహనీయుడు.



## గత సంచికకు ఒక ముఖ్య సవరణ

గత సంచిక (ఫిబ్రవరి) 10వ పుటలో గల శ్రీ చిల్మకూరు నరసింహయ్యకు భార్యా వియోగం అను దానిని మాతృ వియోగంగా సవరించుకొని ఈ వార్తలో గల చనిపోయిన శ్రీమతి వెంకట సుబ్బమ్మ గారు నరసింహయ్య గారి మాతృమూర్తి అని గమనించేది.

# మెఱుపు

✍ శ్రీ బొడ్డు బాపిరాజు

(బాపిరాజుగారు మహాభావకులు. సరస సరళంగా సుమధురంగా పద్యాన్ని నడిపించగల జాషువా, కరుణశ్రీల సరసన నిలువగల కవిరాజు ఈ బాపిరాజు. కవిత్వములోని మాధుర్యాన్ని రసజ్ఞులు మాత్రమే గ్రహిస్తారు. వారి కొరకే ఈ ప్రచురణ – సంపాదకులు.)

ఈ తిమిరావగుంఠనము లించుక యించుక దించుచున్ సుధా
శీతల మందహాస పరిషిక్త విలోల విలోచనోన్మిషత్
జ్యోతులలో దిగంతముల నొక్కపరిన్ వెలిగించుచుండి ని
ర్భీతి చరింతు వింత వివరింపుము నీకథ లోతటిన్నటీ !

జలదాంతఃపుర కేళివాసముల లాస్యశ్రీపదన్యాసముల్
పలుమా రధ్యయనమ్ముసల్పు దివిషద్బాలామణీ! నీ తనూ
విలస త్కాంతి విభా విలాసముల నువ్విళ్లూరు డెందమ్ముతో
కలయంజూతుము కాని, పాంథ హృదయక్వాథమ్ము లా నృత్యముల్.

చెలువారన్ సురలెల్ల రా గడప కుర్చీలందు కొల్వుండ బల్
మెలపుల్ మై జిగిసొంపు జూపి సభవారిన్ రక్తి గట్టింతు మ
ద్దెలకా డెవ్వ డపస్వరమ్ములను పృథ్వీ గోళ మూగించు? నే
ర్పులకుం దగ్గ మరొక్కనిన్ వెదకి కీర్తుల్ వింపు దిగ్భిత్తులన్.

పనిగొన కూరకే తిరుగుబా టొనరించుచు మబ్బుగుర్రముల్
గొనగొనలాడ కొట్టు తళుకుంగొరడా మెర పద్ది యా మహేం
ద్రుని దని యందురే! యబుసు దోపమికిన్ ముసలమ్మ లంచు వే
శను వెలువడ్డ పుక్కిటి పురాణము కాదు గదా క్షణ ప్రభా !

ఏమయినగాని నీ రూపు, నా మనమ్ము నింపు కొన్నది, సౌదామినీ! నిజాన
కింతయో అంతయో హృదయేశ్వరికిని సాటివచ్చుట నయన ప్రచాలనముల.

# నేను, నాదేశం

( గత సంచిక తరువాయి )

అమెరికాలో నే నొక విచిత్ర వివాహం చూచాను. వధూవరులు 70 సం॥ల కంటె అధిక వయస్కులు ఇద్దరికీ పూర్వ వివాహాలవల్ల మునిమనువలు, మనుమ రాండ్రు ఉన్నారు. ఆ అవ్వ, తాతలు నాకు పొరుగున వుండే పరిచితులే. వివాహం చేసుకొన్నందుకు వారిని చాలామంది అభినందించారు. వారిలో నే నొకడిని. వారెందుకు వివాహం చేసుకున్నారో చెప్ప మన్నాను. వారు చిన్నప్పుడు బ్రతుకు తెరువుకోసం ఇంగ్లాండువదలి ఆస్ట్రే లియాకు వెళ్ళాం. అక్కడే పరిచయమై ప్రేమించుకొన్నాం; కాని ఆర్థిక బాధలవల్ల వివాహం చేసుకోజాలకపోతిమి. తర్వాత దేశ దేశాలు తిరగడంలో విడిపోయాము. 45 సం॥ల తరువాత అమెరికాలో కలుసు కున్నాం. అప్పటికే మాకు పెళ్ళిళ్ళయి మనుమలు, మనుమరాండ్రు కలిగారు. ఇద్దరము విధవలమే. బిడ్డల యిండ్లలో వుంటున్నాం. కాలక్షేపానికి ఇద్దరం తఱుచుగా కలుసుకుంటూండే వాళ్ళము. అయితే, ఈ దేశంలో బిడ్డలవద్ద ఉండటం, స్వగృహంలో మేము పెద్దలుగా ఉండలేక పోవడం మా సాంప్రదాయానికి విరుద్ధం కాబట్టి, మే మిద్దరం కలిసి ప్రత్యేకంగా కాపురంపెట్ట నిశ్చయించుకొని "చర్చికి వెళ్ళివచ్చా" మని చెప్పినవ్వారు. నాకూ నవ్వు వచ్చింది. కాని, దీర్ఘాలోచనలో పడ్డాను. వయసుకు తగిన సౌఖ్యాలు ఉంటా యని. వయసుకు తగిన స్నేహితులు ఎంతో అవసరమని, బిడ్డలను కనడానికే గాక జతకొరకు కూడా పెళ్ళి అవసరమేనవి, వివాహానికి వధూవరులే వయసును నిర్ణయించుకోవాలనీ నాకు తోచింది. ఇప్పటికీ నా అభిప్రాయం అదే.

## కమ్మవారిలో వితంతు వివాహాలు

1927–29 సంవత్సరాలలో నేను బెజవాడలో వుంటూవుండగా శ్రీ కోవెల మూడి గోపాలకృష్ణయ్య చౌదరిగారికి (అడ్వొకేటు) నాకు స్నేహమేర్పడినది. వైశ్యకులంలో వితంతూద్వాహాలు జోరుగా సాగిపోతున్నాయి. నా కమ్మ మిత్రులకు అది చాలా ఆశ్చర్యంగా వుంది. వారిష్టపడినా తమకులంలో చేయించ లేదు. నేను చేయించగలిగినందున వారికి నా యందు గౌరవం ఏర్పడింది. శ్రీ కోవెలమూడి గోపాలకృష్ణయ్య చౌదరి గారు కమ్మవారిలో ఒక వితంతువుకు వివాహం చేయించ డంలో సహాయం చెయ్యమన్నారు.

కైకలూరు తాలూకా వరహాపట్నం గ్రామవాసి శ్రీ కామినేని పట్టాభి రామయ్య గారు కమ్మవారు, గొప్ప భూస్వామి. వారి కుమార్తె బాల వితంతువు. ఆమెకు పునర్వివాహం చేయించమని

శ్రీ కో॥ గో॥ కృష్ణయ్య గారు నన్ను ప్రోత్స హించారు.

కమ్మవారిలో నాకు పలుకుబడి లేదనీ, పట్టాభిరామయ్యగారితో నాకు పరిచయం లేదనీ, ఆ పని సాధ్యంకాదనీ నే నెంత చెప్పినా వినక "ఆ గ్రామం వెళ్ళండి; పట్టాభిరామయ్యను కలుసుకోండి; ఆ బిడ్డ అందమైనది. చూస్తే తప్పకుండా వివాహం చేయించుతా"వని ఎంతో ప్రోత్స హించారు. ఈ ప్రోత్సాహంకంటే అన్ని కులాల్లోను యీ సంస్కరణను ప్రవేశ పెట్టాలి. ముఖ్యంగా కమ్మవారిలో ప్రవేశ పెట్టితే ఆంధ్రదేశమంతా చేయించామనే తృప్తివుంటుంది, లేనిచో స్వకులాభి మాని అనే నిందకూడ వస్తుందన్న ఆలోచన నన్ను పురికొల్పుతుండేది. కమ్మవారిలో "వైశ్యుల కున్న ధైర్యసాహసాలు మనకు లేకపోయనే" అన్న చింత వున్నట్టు గ్రహించాను. శ్రీ కామినేని పట్టాభి రామయ్యగారిని కలుసుకొనుటకు వెళ్ళాను. వారితో నేను వచ్చిన పనిని గురించి చెప్పాను.

ఆయన దుఃఖించి కండ్లనీరు పెట్టారే గాని, నోరుతెరచి ఒక్కమాటమాట్లాడ లేదు. కుమార్తెను చూపించనేలేదు. ఆయన దుఃఖాన్ని చూచి తగినవరుడు లభించితే సమ్మతించుననీ, భయపడితే మిత్రుడు గోపాలకృష్ణయ్యగారే ఆ బిడ్డను పెంచుకొని వివాహం చేయించగలడనే నిశ్చయించుకొన్నాను.

అయితే వరుణ్ని సంపాదించడం ఎలా? గోపాలకృష్ణయ్యగారికి కూడా అది పెద్దచిక్కుగానే తోచింది. వధూవరులు కుదరక ముందే ఆ వివాహాన్ని ఎలా జయప్రదం చెయ్యాలా అనే యోచన నన్ను బాధించసాగింది. అసాధ్యమైన పనులను సాధ్యం చెయ్యాలనే కోరిక మనందరిలోను వుంటుంది. నాలోనూ వుంది. కాలం అలాంటిది. కాలాన్ని ఉప యోగించుకోవాలని నా యోచన.

అప్పుడు "ఇంపీరియల్ కెమికల్ ఇండ స్ట్రీసు" అనే కంపెనీ తరపున రసాయనిక ఎరువులను వేయించి, ఉపయోగపడునని చూపుటకు ఇన్స్పెక్టరుగా పనిచేస్తున్నాను. ఆంధ్రలో నా ఇష్టంవచ్చిన చోటుకు ప్రయాణం చేయుటకు కంపెనీవారు అవకాశమిచ్చారు. అనకాపల్లిలోని వ్యవసాయ పరిశోధన కేంద్రాన్ని చూడడానికి వెళ్ళాను. నాకు పరిచయం లేని ఆంధ్ర యువకుడు అక్కడ ఆసి స్టెంటు మేనేజరుగా వున్నాడు. నన్ను తన ఇంటికి భోజనానికి ఆహ్వానించాడు. తాను ఉన్నవవారి శిష్యుడననీ, నన్ను ఎరుగుదుననీ చెప్పాడు. అతనిపేరు దాసరి బాపయ్య బి.యస్.సి. కమ్మవారు; జన్మ స్థానం గుంటూరుజిల్లా బ్రాహ్మణ కోడూరు

భోజనానంతరం కొన్ని గంటలు గడిపిన తరువాత శ్రీ పట్టాభిరామయ్యగారి పుత్రికకు తగిన వరుడని తోచి, ఆయనతో ప్రస్తావించాను. తన కాక్షేపణ లేదనీ, నన్ను చిన్నతనంనుండి పెంచుకొన్న అక్కగారు (బాలవితంతువు) తనకు మాతృ తుల్యులనీ, ఆమెను ఒప్పించమనీ, బాధ్యతను నా మీద వేశారు. ఆమె నా ఎదుటికి రాదు; ఘోషా! ఆమెతో ఎలా మాట్లాడాలో నాకు తోచలేదని

బాపయ్యతో అన్నాను. "ఫరవాలేదు, మాట్లాడవచ్చు"నని నాకు ధైర్యంచెప్పి, తాను ఆఫీసుకు వెళ్ళాడు. బాల వితంతువుల కష్టాలు ఆమెకు స్వయంగా తెలిసినందున నేను ఎక్కువగా బోధించవలసిన అవసరం లేకపోయింది. అయితే, ఈ ఉద్యమానికి తన తమ్ముడినే త్యాగం చెయ్యమని ఆమెను ఒప్పించడం మొదట్లో కష్టమైనా, చివరకు ఒప్పుకొన్నది. నేను బాపయ్యను కలుసుకొన్న 24 గంటలలో సరియైన వరుడు లభించాడు! ఆ పిల్లను బాపయ్యగారు చూచి సమ్మతించే వరకు వివాహవిషయమై పిల్లకెంతమాత్రం తెలుపకూడదని నా ఉద్దేశ్యం. ఈ స్థితిలో వుండగానే శ్రీ కోవెలమూడి గోపాలకృష్ణయ్యగారు మరణించారు. నేనిక రెక్కలు పోయిన పక్షిలాగా అవస్థపడ్డాను.

భోగట్టా చెయ్యగా శ్రీ మాగంటి బాపినీడుగారి పెద్దక్క శ్రీ మాణిక్యాంబగారి కూతురు పట్టాభిరామయ్యగారి మరదలేనని, ఆమె ఈ బిడ్డను పెంచుకొన్నదనీ తెలిసింది. మాణిక్యాంబగారిని కలుసుకొని ఈ విషయమంతా చెప్పాను. ఆమె పిడుగులాంటి మనిషి; ధైర్యసాహసాలున్న మనిషి. ఆమెకూ యిలాంటి అభిప్రాయాలే వున్నై. కాబట్టి నా కృషి సులభంగా ఫలిస్తుందని ఎంతో సంతోషించాను. మాణిక్యాంబారు ఆ గ్రామంవెళ్ళి పిల్లను, పిల్లతల్లిని, పినతల్లిని ఒప్పించి, తేదీ నిర్ణయించి, బాపయ్యను పంపమని వ్రాసినారు. ఈ విషయాన్ని వారు మగవారికి తెలుపనేలేదు. బాపయ్యను పంపాను. పిల్ల, పిల్లవాడు ఒప్పుకున్నారు. ప్రమాణాలుచేసి, దండలు మార్చుకొన్నారు. పెద్దలు ముగ్గురు అనగా స్త్రీలు మాత్రమే ఆశీర్వదించి, బాపయ్యను పెండ్లికి తయారుకమ్మని ఆశపెట్టారు. అంతవరకు పట్టాభిరామయ్య గారికీ, ఆయన తమ్మునికీ తెలుపనేలేదు. చివరకు పట్టాభిరామయ్యగారినికూడ ఒప్పించారు. తేదీ నిర్ణయమేకొరవ.

## కమ్మ నాయకుని అడ్డు

పట్టాభిరామయ్యగారు రాజకీయాలలో అంటే పవర్ పాలిటిక్సులో గుడివాడ కమ్మనాయకుని అనుచరుడు. తనబిడ్డ పునర్వివాహ విషయంలో తమ నాయకుని సలహా కోరాడు. నాయకుని జవాబు నాకు తెలియదు. బాపయ్య వివాహం తప్పక జరుగుతుందని నమ్మి పట్టాభిరామయ్యగారిని "మామ" అనీ, ఆయన కుమార్తెను "ప్రేయసి" "భార్య" అనీ ఉత్తరాలలో వ్రాసేవాడు. వారిద్దరికీ ప్రేమ వృద్ధి అవుతూ వచ్చింది. త్వరగా వివాహం జరగాలని ఇద్దరూ తీర్మానించుకొన్నారు. కాని, కొంతకాలానికి "మామగారు" ప్రత్యుత్తరాలు మానేశారు. బాపయ్యగారికి దుఃఖం, క్రోధం పెరిగిపోతూవున్నాయి.

ఈలోగా మరొక వత్తిడి వచ్చింది. బాపయ్య అన్నగారు జైపూరు ఎస్టేటులో అసిస్టెంటు దివాను. ఈ వివాహాన్ని మాన్పించమని దివానుగారు అసిస్టెంటు దివానుగారితో గట్టిగా చెప్పడం ప్రారంభించారట. గుడివాడ కమ్మనాయకుడుగారు

ఈ యెత్తు వేశారని బాపయ్య తలిచాడు. ఆయనను చంపి కసి తీర్చుకోవాలను కొన్నాడు! బెజవాడలో నా యింటికి వచ్చాడు. ఒక కత్తిని చూపించాడు. చంపు తానని చెప్పాడు. అంతపనీ చేస్తాడనే నాకు తోచింది.

నాకు కావలసింది హత్యలుకాదు. బాపయ్యకు, ఆ అమ్మాయికి వివాహం చేయించడం, తద్వారా కమ్మవారిలో ఆంధ్రదేశంలో ఈ సంస్కరణ జయప్రద మయ్యేలా చేయుటే నా కర్తవ్యం. అదీగాక మరణశిక్షకు తగినంత నేరం కమ్మ నాయకుడు చెయ్యలేదని నా తలంపు. ఆయన తన మనసు మార్చుకోక పోతే పరాభవం చెయ్యడం మాత్రమే న్యాయ మని నా భావం. తుదకు బాపయ్య నాతో ఏకీభవించాడు. నేను చెప్పనట్లే చేస్తానని ప్రమాణం చేశాడు. కత్తిని మా ఇంట్లోనే పెట్టి బందరు వెళ్ళాము.

కమ్మనాయకుని ఎత్తులు ముందుగా తెలియనిదే లాభంలేదు. కాబట్టి, బాగా భోగట్టా తెలుసుకోవాలనుకున్నాను. అప్పుడు కమ్మ సంఘాధ్యక్షులు శ్రీ కొమ్మారెడ్డి పట్టాభిరామయ్యగారు. పవర్ పాలిటిక్సు ఎరుగనివారని, ఆయనద్వారా నిజం తెలుసుకోవచ్చునీ ఎవరో సలహా యిచ్చారు.

శ్రీ కొమ్మారెడ్డి పట్టాభిరామయ్య గారు మమ్ములను మర్యాదచేసి, నిర్మొగ మాటంగా వున్నది వున్నట్లు చెప్పారు. గుడివాడ కమ్మనాయకుని పార్టీలో వధువు తండ్రి చాలా ముఖ్యమైనవారని, ఆయన్ను పార్టీలోనుండి పోగొట్టుకోరనీ, బాపయ్య అన్నగారి మీద తెచ్చిన ఒత్తిడిద్వారా వివాహాన్ని ఆపలేకపోయారనీ, అందువల్లి మరోఎత్తు ఎత్తారని చెప్పారు. వివాహం చేయించుతానని పట్టాభిరామయ్యగారికి మాట యిచ్చి, చేయించకుండా కాలయాపన చేసేందుకు ప్లాను వేశారట. "వివాహం చేయదలచితే ఏ అనామకుడికో గాక, ఒక అడ్వొకేటుకు యిచ్చి పెళ్ళిచేసి గుడివాడలోనో, బందరులోనో ప్రాక్టీసు పెట్టించి డిస్ట్రిక్టు మునసబు ఉద్యోగం యిప్పించడం మంచి"దని నాయకుడు తన అనుచరునకు సలహా ఇచ్చారు. బాపయ్య కివ్వడం మానెయ్యమన్నారు. ఇకనేం బాపయ్యను మానేశారు. అయితే అడ్వొకేటు లభించాలిగా! చిత్తూరు జిల్లాలో లభిస్తాడని పుకారు పుట్టించారు. వరాణ్వేషణకని ఎవరినో పంపారట. ఇదంతా వివాహం జరగకుండా గడపడానికి కేనని రూఢిగా శ్రీ కొమ్మారెడ్డిగారు చెప్పే శారు. తానిలా చెప్పినట్టు తన పేరును వెల్లడించవద్దని కోరారు. అలాగే చేశాము.

అంతట మేము దీర్ఘంగా ఆలోచించి ఒకప్లాను వేసుకొన్నాము. "నాయకుడిని" ప్రత్యేకంగా కలుసుకొని ఆయన నేరాన్ని ఒప్పించాలి. బాపయ్య వివాహం వెంటనే చేయించడానికి సమ్మ తింపజేయాలి; అలా అంగీకరించకపోతే మేము బాగా పరాభవించాలి. అందుకు కనీసం ఆరుమాసాల జైలుశిక్షకు మేమిద్దరం సిద్ధపడాలి. ఇదీ మా ప్లాను.

( ఇంకా ఉంది )

# మానవ జననము - బాలారిష్ట చంద్రారిష్ట దోషములు

రచన : శ్రీ నత్రసాలి వేణుగోపాల్, బి.ఎ., ధర్మవరము.

మానవ సృష్టి గ్రహ ప్రభావానికి లోబడి వున్నది. మానవ జనన సమయమున గ్రహదృష్టి నక్షత్ర పరిస్థితి బాగాలేకుంటే ఆ మానవ మనుగడ బహు సందేహాస్పదాలతో కూడి అనారోగ్యకరమై బహు ఇక్కట్టులను శిశువుకు కల్పించును. గ్రహస్థితి బాగా వుండి, జన్మిస్తే వాని జీవన స్రవంతి ఆరోగ్యకరమై ఆనందదాయకము కాగలదు. అశుభ జనితాలు చంద్రారిష్ట, బాలారిష్ట దోషాలని పిలువబడతాయి. ఈ విషయము యావత్తు శాస్త్ర సమ్మతము.

నవగ్రహములు 9. అని చాలా మందికి తెలిసే వుంటుంది. చంద్రారిష్ట బాలారిష్ట ఆయుర్భావములు చాలావరకు చంద్రుని పైన, ఆయుఃకారకుడగు శని గ్రహ ప్రభావముపైన ఆధారపడి యుండునని శాస్త్ర విధితము.

చంద్రారిష్ట, బాలారిష్ట ఆయుఃకారకులను తెలుసుకొనుటకు ముందు ముఖ్యముగా నవగ్రహములలో స్వతః శుభ గ్రహములను, పాపగ్రహములను తెలుసుకొనుట చాలా ముఖ్యము. అవి ఏవన రవి, కుజ, శని, ఛాయా గ్రహములగు రాహు కేతువులు, క్షీణ చంద్రుడు అనగా కృష్ణ పక్ష దశమి నుండి శుక్ల పక్ష పంచమి వరకు గల చంద్రుడు, పాప సంబంధము కలిగిన బుధుడు పాప గ్రహములని పిలువబడుదురు.

గురువు, శుక్రుడు, పూర్ణ చంద్రుడు శుభ సంపర్కము కల్గిన బుధుడు. శుక్ల పక్ష దశమి నుండి కృష్ణ పక్ష పంచమి వరకు గల చంద్రుడు శుభ గ్రహములని గుర్తించుకొనుట చాలా ముఖ్యము.

బాలారిష్ట దోషములు సాధారణముగా గ్రహములు శుభదృష్టిలేక శత్రుక్షేత్ర నీచగతులైనపుడు జనన కాలమున లగ్నమునకు 8ట, చంద్రుడు, 7ట కుజుడు, 9ట రాహువు లగ్నమున శని, 3ట గురువు, 5ట రవి, 6ట శుక్రుడు, 4ట బుధుడు, 12ట కేతువు వున్నపుడు బాలారిష్ట దోషములు సంభవమగుటకు ఆస్కారములు కలుగుచుండుట మనకు గోచరమగుచుండును.

చంద్రుడు బలహీనుడైనపుడు జాతకునకు బాలారిష్టము సంభవించును. సాధారణముగా చంద్రుడు నీచ రాశి అగు వృశ్చికము యందు వున్నపుడు లగ్నాధిపతి నీచ స్థానమందున్నపుడు, రవితో చేరి అస్తంగతుడైనపుడు, లగ్నమునకు, లగ్నాధిపతి 6, 8, 12, స్థానములయందున్నపుడు సాధారణంగా బాలారిష్టములు సంభవించు చుండును.

క్షీణ చంద్రుడు లగ్నమునందుండి, పాపగ్రహములు కేంద్రములయందు అనగా లగ్నమునకు 1, 4, 7, 10, స్థానముల యందున్న చాలా వరకు తప్పక

బాలారిష్టము సంభవించి అతని మృతికి కూడా దారితీయగలదు. పాపగ్రహము లన్నియు పై స్థానములందుండుట గమనించవలెను.

చంద్రుడు బలహీనుడైనపుడు క్రూర గ్రహములగు రవి, కుజుల చేరిక వుండుట చేతను, పరస్పర దృష్టివలన చంద్రుడు సాధారణముగా అతి దుర్బలుడగును. అపుడు శిసువు వేదనలను కలిగి బహు బాధలను పొందగలదు. దానిని చంద్రా రిష్టదోషమందురు. అట్టి అరిష్టకాలమున తల్లికి సహా ప్రసవము చాలా కష్టమై మాతారిష్టమునకు కూడా దారి తీయ గలదు. చంద్రుడు బలవంతుడై ఉచ్ఛ యందు కాని, స్వస్థానమందుకానీ వున్న సుఖప్రసవము కాగలదు. శిశువు సహా సుఖ సౌఖ్యము పొందగలదు.

లగ్నాధిపతి నీచ స్థానమునందుండి శని లగ్నమునకు 7ట కాని, 8ట కాని వున్న శిశువు అనేక విధములైన కష్ట నష్టములకు గురియగుచుండుట మనము సాధారణముగా చూడగలము.

ముఖ్యముగా యీ బాలారిష్టసమయ ములందు జాగ్రత్తగా గమనించ దగ్గది ఏమనగా లగ్నమునందు పాపగ్రహముండి దానిని సప్తమమున మరియొక పాపగ్రహ ముండి చంద్రుడు వాటిలో లగ్నమున కాని, సప్తమమున కాని ఆ క్రూర గ్రహము లచే కూడుకొని ఆ చంద్రుని ఒక శుభగ్రహ మైనను చూడక, చేరకవున్న తప్పక అది బాలారిష్టమై కొన్ని సందర్భము లందు శిశువు మరణమునకు దారితీయ గలదు.

ముఖ్యముగా ఇంకొకటి మనము గమనించ దగ్గది ఏమన చంద్రుడు ద్వాదశ, సప్తమ, అష్టమ, లగ్నములలో ఏదైనా ఒక దానిలో వుండి శుభగ్రహములు చంద్రుని చూడక, ఆ శుభగ్రహములు సహా కేంద్రములయందు వుండక వున్నచో అదియును బాలారిష్టమునకు దారి తీయును.

రవి, చంద్రులు ఒక రాశియందు వుండి వారికి 12వ స్థానమున రాహు వున్న అదియు బాలారిష్టమగును. రవి చంద్రులు కలసి ఒక రాశియందు వుండుట సామాన్యముగా చతుర్దశి, అమావాస్యలందు సాధారణముగా సంభవించు చుండును.

లగ్నమునకు 2ట కాని, 12ట కాని, 6, 8, కాని వున్న పాపగ్రహములను శుభ గ్రహముల కలయిక వున్న కాని, ఆ పాప గ్రహములను శుభగ్రహములు చూడక వున్నను అధియూ బాలారిష్ట దోషమై శిశువు మృతికి సహా దారితీయగలదు.

లగ్నాధిపతి 8ట వుండి పాప గ్రహములచే చూడబడుచున్నను అదియు బాలారిష్టమని అందురు. లగ్నము, సప్తమము, అష్టమ రాసులందు పాప గ్రహములు వుండి వ్యయమందు చంద్రుడు వుండి, కేంద్రములయందు శుభగ్రహములు లేకున్నను, శిశువుకు బాలారిష్టము సంభవమై మరణమునకు దారితీయగలదు.

జన్మ లగ్నమునందు రవి కాని, చంద్రుడు కాని, ఎవరైనా ఒకరు వుండి పాపగ్రహములు అనగా కుజుడు కాని, శని

కాని ఎవరైనను పంచమ, అష్టమ, నవములలో వుండి శుభగ్రహ వీక్షణ కాని శుభగ్రహ చేరిక కాని లేకయున్న అదియును బాలారిష్టమని అందురు.

శని చంద్రులు కలసి 6ట కాని, 8ట కాని వుండి శుభగ్రహ సంబంధము లేకున్న అది బాలారిష్టకమునకు దారితీయును.

లగ్నమునందు శని, 8ట కుజుడు, కేంద్రమునందు గురువు లేకున్న శిశువు మరణించుటకు ఆస్పదము కలదు.

ఇట్లు అనేక రీతుల చంద్రారిష్టబాలారిష్ట దోషములు జనన సమయమున శిశువు నకు సంభవించుట సర్వ విధితము. కానీ, కడు శ్రద్ధతో యీ క్రింది వాటిని గమనించిన బాలారిష్ట భంగములు సహా మనము గమనించవచ్చును.

1). లగ్నమును గురువు చూచినను, లగ్నాధిపతి గురువుతో చేరినను బాలారిష్ట భంగమగును.

2). లగ్నమునకు సప్తమమున చంద్రుడు వున్ననూ, చంద్రునికి సప్తమ మున గురువు వున్ననూ అనగా గజకేసరి యోగ జాతకునకు చాలా వరకు బాలారిష్ట భంగము కలిగి శిశువు సుఖ జీవితమును గడుపగలడు.

3). వృషభ, కుంభ రాశులయందు రవి వున్నను వృషభమునందు కుజుడు వున్నపుడు చాలా వరకు బాలారిష్టభంగము కలుగును.

4). అష్టమాధిపతి బలవంతుడై శుభ గ్రహముతో చేరి లగ్నమునందున్నపుడు బాలారిష్టభంగము జరుగునని గుర్తించుము.

5). జాతకమునందు బాలారిష్టములు ఎన్ని యున్నప్పటికి ఈ క్రింద జన్మించిన నక్షత్ర శిశువులకు చాలా వరకు బాలారిష్టములు సంభవించవు.

1. మృగశిర 2, 3, 4 పాదములు.
2. ఆర్ద్ర, పునర్వసు, ఆశ్లేష, పుబ్బ నక్షత్రములు.
3. చిత్త 3, 4 పాదములు.
4. స్వాతి, విశాఖ 1, 2, 3 పాదములు.
5. రేవతి, పూర్వాభాద్ర నక్షత్రములు.

6). చంద్రుడు ఉచ్ఛ, స్వక్షేత్ర, మిత్ర క్షేత్రములయందుండి శుభులచే చూడబడుచూ, పాపగ్రహ సంబంధము లేనిచో బాలారిష్టములు నశించును.

7). చంద్రుడు 6, 8, 12 స్థానముల యందున్నను లగ్నాధిపతిచే చూడబడు సందర్భములందు బాలారిష్టము సంభవింపదు.

8). రాహువు 3, 6, 11 స్థానముల యందుండి శుభగ్రహములచే చూడబడి నను సకల అరిష్టములు తొలగునని శాస్త్ర సమ్మతము.

ముఖ్యముగా గమనించ దగ్గ విషయ ములు శుభులు ఉచ్ఛ, స్వక్షేత్ర, మిత్ర క్షేత్రములలో బలవత్తరముగా వుండు సమయములందు, గురు శుక్రులు కేంద్ర ములయందు వుండు సందర్భముల యందు, శుభులు బలవత్తరముగా వుండి పాపులు బలహీనులైనపుడు బాలారిష్టములు సంభవమగుటకు ఆస్కారము లేదని మనము గుర్తించు కోవాలి.

చంద్రార్కాస్త బాలారిష్ట దోషములను సరియైన దృష్టిచే గుర్తించి త్వరిత పడక నిర్ణయము చేయరాదు. గ్రహస్థానములను, తత్ స్థానాధిపతుల నిర్దేశములను, స్థూలముగా గ్రహ దృష్టులను పరిశోధన చేయుట చాలా ముఖ్యము. మనో వ్యధకు గురి కాకుండా పరిశోధన చేయ

సముదావహము. మానవ ప్రయత్నము ఎంత వున్నను భగవంతుని కృపా దృష్టి జీవిపై వున్నప్పుడే దోష నివృత్తులకు ఆస్కారము కలదు. "సంకటము కలిగినపుడే కదా వెంకటరమణుడు" గుర్తుకు రాగలడు. కాన పరిశోధన చాలా ముఖ్యము. గ్రహములను, గ్రహ దృష్టులను స్థూలముగను, సూక్ష్మముగను పరిశోధన చేయుట శాస్త్ర సమ్మతం.

నవగ్రహ ధ్యాన సర్వారిష్టములను తొలగించి శిశువుకు శుభ నవ్య జీవితము నొసంగునని శాస్త్ర నిర్దేశితము. భగవంతునిపై నమ్మకమున్న వారు ఈ పై విషయములు మూఢనమ్మకములని త్రోసిపుచ్చక మనలను నడిపించే అజ్ఞాత శక్తికి మనమంతా లోబడినామని గ్రహించి ఆ మహిమాన్విత శక్తికి శిరసు వంచి సాష్టాంగ దండ ప్రణామములొనరించి ఆ పరమపావన శక్తి, కరుణార్ద్రచూపుల శుభ కిరణములు మానవ సృష్టిపై ప్రసరించాలని ఆ దయామూర్తిని ప్రార్థిస్తాము.

ఓం శాంతిః ఓంశాంతిః శాంతిః

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.
## ( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )

టెలిగ్రాం అన్ని చోట్లా " VASAVI "
టెలిఫోన్ నెంబరు : మార్కాపురం : 2595, శ్రీశైలం : 3140, 3114,
పుట్టపర్తి : 2040, తిరుమల : అప్లైడ్.

## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాల్గు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :– 128 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, 4 పెద్ద హాల్సు, పూర్తిగా తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో ఒక లక్షయాభై వేల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00 లు శాశ్వతసభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును.

   రెండవ అంతస్తులో 37 రూములు కట్టుచున్నాము. 30×10 రూము రూ.30,000/-, 15×7 రూముకు రూ.20,000/- అగును. రూము విరాళంయిస్తే దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 75 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. సాధ్యమైనంత త్వరలో పూర్తిగా అన్ని వసతులతో నిర్మాణం చేసి, నిత్య భోజనములు ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు త్వరలో జరుగుచున్నవి. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.80,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 10×25 రూమ్‌కు రూ.50,000 ఇచ్చిన యెడల దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 100 రోజులు రూము యివ్వబడును. మిగతా రోజులు యాత్రికులకు యివ్వబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల</u> : తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనపు పనులు చురుకుగా సాగుచున్నవి. రెండు హాల్సు 52×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) నిర్మాణములో కలవు. సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

I&II ఫ్లోరు రూము డోనార్సు : 10 రూములకు పరిమితము. ఒక లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు సంవత్సరంలో 30 రోజులు రూము యివ్వబడును. వారి ఫోటో శిలా ఫలక రూములో వేయబడును.

హాల్సు డోనార్సు : 52×10 అడుగుల ఒక అంకణము హాలుకు లక్షరూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు ఉచితంగా యివ్వబడును. 20 అంకణములు పరిమితం.

మహారాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. పది వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో ఐదు రోజులు రూము యివ్వబడును. ఫోటో శిలా ఫలకము వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును.

రాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. ఆరు వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో మూడు రోజులు రూము యివ్వబడును. నాపరాయిపైన పేరు వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును. "వాసవీ భవన్, తిరుమల"కు కార్యదర్శి కార్యాలయం, మార్కాపురం అని వ్రాసి ముందుగా పంపు వారి DD మాత్రమే ఆమోదించబడును. చెక్కులు పంపవచ్చును. కాని ఆ చెక్కులు చెల్లివచ్చినప్పుడే సీరియల్ లోకి వచ్చును. అవకాశము లేని వారి పైకము తిరిగి వాపసు పంపు అధికారం సంఘమునకు కలదు. DD లు మార్కాపురం, స్టేటు బ్యాంకు, వైశ్యా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్ లపై పంపగోర్తాము. త్వరలో తిరుమలలో ఆఫీసు ఓపెన్ చేస్తాము. అంతవరకు పై అడ్రసుకు పంపకోర్తాము.

4. <u>వాసవీ నిలయం, పెనుగొండ</u> : పరిశీలనలో ఉంది.

5. <u>వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి</u>

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ

పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో నాలుగు సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన నాలుగు సత్రములలో వేయబడును. వీరికి వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం అన్ని సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారంపర్య సభ్యులు. వీరి ఫోటో మన సంఘము నిర్వహించు అన్ని సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా అన్ని సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో దాత కోరిన మన సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో దాత కోరిన ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వేయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు దాత కోరిన ఒక సత్రములో నాపరాయిపైన వేయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ పంపకం కమిటీ తీర్మానం ప్రకారం నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

-: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :-

**మూర్తి వెంకటేశ్వర్లు, వాసవీ సత్రముల కార్యదర్శి కార్యాలయం,**

**మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.**

**అధ్యక్షులు : ఆత్మకూరు నాగభూషణం శ్రేష్ఠి, నంద్యాల.**

**N.B :-** పై సత్రముల పేరుతో - DD లు కాని, చెక్కులుకాని పంపకోర్తాము. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# వైశ్య ప్రబోధిని – క్యాలెండరు

( 1994 మార్చి 21 నుండి 1994 ఏప్రిల్ 20 వరకు )

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 27 | 3 | 10 | 17 |
| సోమవారము | 21 | 28 | 4 | 11 | 18 |
| మంగళవారము | 22 | 29 | 5 | 12 | 19 |
| బుధవారము | 23 | 30 | 6 | 13 | 20 |
| గురువారము | 24 | 31 | 7 | 14 | |
| శుక్రవారము | 25 | ఏప్రిల్ 1 | 8 | 15 | |
| శనివారము | 26 | 2 | 9 | 16 | |

మార్చి 22 :– శక సంవత్సరం 1916 ప్రారంభం.

మార్చి 25 :– A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు, చివరి

మార్చి 26 :– హోలీ పండుగ.

మార్చి 31 :– రేవతి కార్తె ప్రారంభం.

ఏప్రెల్ 11 :– ఉగాది – శ్రీ భావనామ సంవత్సర ప్రారంభం – వసంత నవరాత్రారంభం – దుకాణాలు – సంస్థలు, కర్మాగారాలు– సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

ఏప్రెల్ 13 :– అశ్వని కార్తె ప్రారంభం.

ఏప్రెల్ 15 :– చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతోబాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

ఏప్రెల్ 20 :– శ్రీరామ నవమి.

**27, 3, 10, 17 ఆదివారాలు**

నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# రామచరిత మానసం

( తులసీ రామాయణము )

తెలుగు సేత : శ్రీ గాధంశెట్టి శ్రీరాములు, యం.ఎ.

( గత సంచిక తరువాయి )

మేఘనాధుడు లక్ష్మణుడు హోరాహోరీగా యుద్ధం చేస్తూ వున్నారు. ఒకరి నొకరు జయించలేకుండా వున్నారు. రాక్షసులు మోసాలు, కుతంత్రాలూ చేస్తూ వున్నారు. లక్ష్మణుడికి కోపం వచ్చింది. మేఘనాధుని రథం విరగ్గొట్టాడు. సారథిని ముక్కలు ముక్కలు చేశాడు. రకరకాలుగా దెబ్బ తీస్తూ వున్నాడు.

మేఘనాధుడు తన ప్రాణాలకే ముప్పు వచ్చిందను కున్నాడు. వెంటనే వీరఘాతుకమైన శక్తిని వొదిలాడు ఆ తేజోపూర్ణమైన శక్తి లక్ష్మణుని గుండెలకు తగిలింది. లక్ష్మణుడు మూర్ఛపోయాడు. మేఘనాధుడు నిర్భయంగా అతడి వద్దకెళ్లాడు.

మేఘనాధునితో సమానమైన వీరులు ఎందరో లక్ష్మణుణ్ణి ఎత్తడానికి ప్రయత్నం చేశారు. కాని జగత్తునే మోసే ఆది శేషుణ్ణి ఎత్తడం వాళ్లతరమా? అందరూ పరాభవంతో తిరిగిపోయారు.

ఎవరి కోపాగ్ని పద్నాలుగు భువనాలను క్షణంలో తగల బెట్టగలదో, దేవతలు, మానవులు సమస్త చరాచరం ఎవర్ని సేవిస్తూ వున్నారో అతణ్ణి యుద్ధంలో ఎవరు జయించగలరు? శ్రీరాముని కృపకు పాత్రులయిన వారే ఈ లీలలు తెలుసుకోగలరు.

సంధ్యాకాలం కాగానే ఉభయసేనలు తిరిగి పోయాయి.

కరుణానిధియైన రాముడు లక్ష్మణుని గురించి అడిగాడు. హనుమంతుడు లక్ష్మణుణ్ణి ఎత్తుకవచ్చాడు. సోదరుణ్ణి ఆస్థితిలో చూసి రాముడు దుఃఖపోయాడు.

లంకలో సుషేణుడనే వైద్యుడు వున్నాడు. అతణ్ణి ఎవరు తొడుక వస్తారని జాంబవంతుడు అడిగాడు. హనుమంతుడు సూక్ష్మరూపం ధరించిపోయి వెంటనే సుషేణుడు నివసిస్తున్న ఇంటినే ఎత్తుకొని వచ్చాడు.

సుషేణుడు రామచంద్రుడి పాదాలకు నమస్కరించాడు. లక్ష్మణుణ్ణి చూశాడు. పర్వతం పేరు, ఔషధం పేరు చెప్పి వెంటనే తెమ్మని హనుమంతునితో చెప్పాడు.

హనుమంతుడు రామచరణారవిందాలను తన హృదయమందు నిలుపుకొని, ఇప్పుడే తెస్తానని చెప్పి బయలుదేరాడు.

ఒక గూఢచారి ఈ వార్తను రావణునికి అందించాడు. అప్పుడు రావణుడు కాలనేమి ఇంటికి వెళ్లాడు. పరిస్థితి వివరించాడు. కాని కాలనేమి రావణుని మేలుకోరి శ్రీరాముని భజించమని కోరాడు. కాని రావణుడు కోపగించుకోవడంతో కాలనేమి భయపడిపోయాడు.

రావణుని చేతిలో చచ్చిపోయే దాని కంటే రామదూత చేతిలో చావడం మంచిదను కొని రావణుడు చెప్పినట్లుగా చేయడానికి బయలుదేరాడు. హనుమంతుని మార్గానికి అడ్డు తగిలాడు. దారిలో మాయను సృష్టించాడు. దారి పొడవునా చెరువులు, మందిరాలు, అందమైన వనాలు నిర్మించాడు. హనుమంతుడు వాటినన్నిటినీ చూశాడు. ముని ఆశ్రమంలోదిగి మంచినీళ్లు తాగి అలసట తీర్చు కుందామను కున్నాడు.

కాలనేమి అక్కడ కపటముని వేషంతో కూర్చొని వున్నాడు. తన మాయ చేత రామదూతనే భ్రమ పెట్టాలను కున్నాడు. హనుమంతుడు వెళ్లి అతనికి నమస్కరించాడు

'హనుమా! రామరావణుల మధ్య యుద్ధం జరుగుతూంది. రాముడే గెలుస్తాడు. సందేహంలేదు. నేను ఇక్కడ కూర్చొనే అంతా చూస్తూ వున్నాను. నాకు జ్ఞాన దృష్టి వుంది." అన్నాడు కపటముని కాలనేమి.

హనుమంతుడు మంచి నీళ్లు అడిగాడు. అతడు కమండలం ఇచ్చాడు. ఈ కొద్ది జలంతో నాకు దప్పిక తీరదన్నాడు హనుమ.

అలాగైతే చెరువుకు వెళ్లి స్నానం చేసిరా.నీకు జ్ఞానం కలిగేటట్లు ఉపదేశం చేస్తానన్నాడు.

హనుమంతుడు చెరువులో దిగ్గానే ఒక మొసలి పరుగున వచ్చి హనుమంతుని. కాళ్లు పట్టేసింది. హనుమంతుడు దాన్ని చంపిపారేశాడు. అప్పుడు అది దివ్య స్వరూపం దాల్చి విమానం ఎక్కి ఆకాశంలోకి ఎగిరిపోయి,

"వానరా, నేను నీ దర్శనంతో పాప రహితమైపోయాను. నా శాపం తొలగిపోయింది. నిన్ను ఇక్కడకు పంపి వాడు నిజమైన మునికాదు. కపట రాక్షసుడు. నా మాటలు నమ్ము." అంటూ ఆ అప్సరస ఎగిరిపోయింది.

హనుమంతుడు రాక్షసుని వద్దకెళ్లి "మునీశ్వరా, ముందు గురు దక్షిణ తీసుకొని ఆనక ఉపదేశం చేయండి." అని వెంటనే అతడి తలను తన తోకతో చుట్టి నేల కేసి కొట్టాడు. చస్తూ చస్తూ ఆరాక్షసుడు తన పేరు చెప్పి చచ్చాడు.

హనుమంతుడు ఉల్లాసంతో బయలు దేరి వెళ్లాడు. వైద్యుడు చెప్పిన పర్వతాన్ని చూశాడు. కాని ఔషధం గుర్తు చిక్కలేదు. కనుక పర్వతాన్నే పెకలించుకొని ఆకాశమార్గాన బయలుదేరి వస్తున్నాడు. దారిలో అయోధ్యానగరం పైకి చేరుకొన్నాడు. క్రింద నుంచి భరతుడు చూశాడు. పైన ఒక విశాల స్వరూపం పోతూ వుండడం గమనించి, ఎవరో రాక్షసుడు అయి వుంటాడని అనుకొన్నాడు. కొనలేని ఒక బాణాన్ని ఎక్కుపెట్టి ఆ కర్ణాంతంలాగి వదిలాడు. బాణం తగలగానే 'రామ్ రామ్' అంటూ హనుమంతుడు క్రింద మూర్ఛ పడిపోయాడు.

హనుమ నోట రామనామస్మరణ విన్న భరతుడు ఆతురతగా ఆప్యాయతతో దగ్గరకు పరుగెత్తాడు. హనుమంతుణ్ణి తన హృదయానికి హత్తుకున్నాడు.ఎంత

లేపినాలేవలేదు. భరతుని ముఖం వాడి పోయింది. దుఃఖించాడు. చేత్తో నీళ్ల పట్టుకొని-తొలుత రాముణ్ణి నాకు దూరం చేసిన విధాతే మళ్లీ నాకు ఈ దుఃఖం కలిగించాడు. నాకు మనో వాక్కాయ కర్మల చేత రాముని పాదాలయందు నిష్కపట ప్రేమ గనక వుంటే, శ్రీరాముడు నా యందు దయగలవాడైతే ఈ వానరుడి మూర్ఛ తొలగిపోవుగాక!-అంటూ ఆ నీళ్ల హనుమంతుని ముఖాన చల్లాడు.

ఆనీళ్లు తగిలిన వెంటనే 'కోసలపతి శ్రీరాముడికీ జై' అంటూ హనుమంతుడు లేచి కూర్చున్నాడు.

భరతుడు హనుమంతుణ్ని మళ్లీ తన హృదయానికి హత్తుకున్నాడు. ఉభయుల శరీరాలు పుల కాయమానమయ్యాయి. ఆనందా శ్రువులు రాలాయి.

భరతుడు సీత రామలక్ష్మణుల క్షేమ సమాచారం అడిగాడు. హనుమంతుడు అంతవరకు జరిగిన కధ అంతా పూర్తిగా వివరించాడు. ఆ దుఃఖ కధ విని భరతుడు ఎంతో బాధ పడ్డాడు.

హో, దైవమా, లోకంలో నేను ఎందుకు పుట్టాను. నా స్వామికి నేను ఒక్కమారు కూడా సేవ చేయ లేకపోయాను- అంటూ వాపోయాడు.

కాలా తీతమైపోతున్నదని తెలుసు కొన్న భరతుడు "హనుమా, నువ్వు వెళ్లడానికి ఆలస్యమై పోయింది. తెల్ల వారితే పరిస్థితి విషమిస్తుంది. కనుక నువ్వు పర్వతంతో సహా నా బాణం పైన ఎక్కు, నేను నిన్ను శ్రీరాముని వద్దకు సుఖంగా పంపిస్తాను." అన్నాడు.

భరతుని మాటలకు హనుమంతుని మనస్సులో అభిమానం తల ఎత్తింది. నా బరువుతో బాణం ఎలా నడుస్తుంది? అనుకున్నాడు. కాని రామచంద్రుని ప్రభావం తల్చుకొని భరతుని పాదాలకు మొక్కి, "స్వామీ, మీ ప్రభావం మనస్సులో తల్చుకుంటూ వెంటనే పోగలను!" అని చెప్పి వెళ్లిపోయాడు.

అక్కడ రాముడు ఒక సాధారణ మానవునిలాగా తమ్ముని దుస్థితి తల్చు కొని చింతిస్తూ వున్నాడు. "తమ్ముడా, నా మేలుకోరి నీవు తల్లిదండ్రులను కూడా వొదిలిపెట్టి వచ్చావు? నాతోపాటు అరణ్య వాసపు బాధలన్నీ పడ్డావు. ఆ ప్రేమ అంతా ఇప్పుడేమయి పోయింది? నా బాధ చూసైనా లేవవా? ఈ విధంగా అరణ్యావాసంలో సీతో వియోగం సంభవి స్తుందని ముందుగా తెలిసి వుంటే, నేను తండ్రి మాట కూడా పాటించేవాణ్ణి కాదు. పుత్రులు, ధనము, భార్య, ఇళ్లు వాకిళ్లు-ఇవన్నీ లోకంలో మాటి మాటికీ కలుగుతూ వుంటాయి. కాని సహోదరుడైన తమ్ముడు మళ్లీ మళ్లీ లభించడు. నా ప్రేమను తల్చుకొనైనా మేలుకోవా? భార్య కోసరంగా తమ్ముణ్ణి పోగొట్టుకొని నేను ఏ ముఖం పెట్టుకొని అయోధ్యకు వెళ్లేది? నా పైన నమ్మకంతో నిన్ను నా చేతికి అప్ప జెప్పిన నీ తల్లికి నేను ఏమని జవాబు చెప్పేది? " అంటూ అందరి బాధలు తొలగించే శ్రీరాముడే ఇలా బాధ పడుతూ వున్నాడు. కళ్ల వెంట నీళ్లు కారుస్తూ వున్నాడు. ఇలాంటి రాముని

మానవలీల చూసి వానరులంతా దుఃఖ పోతూ వున్నారు.

అంతలోనే, కరుణరసంతో వీరరసం మిశ్రితమయిందా అన్నట్లుగా హనుమంతుడు సంజీవి పర్వతాన్ని తీసుకొని దిగాడు.

శ్రీ రాముడు ఆనందంతో హనుమంతుణ్ణి ఆ లింగనం చేసుకొన్నాడు.

సుషేణుడు వైద్యం చేయగానే లక్ష్మణుడు ఆనందంతో లేచి కూర్చున్నాడు. రామలక్ష్మణులు ప్రేమతో ఆలింగనం చేసుకొన్నారు. వానర మూకలన్నీ ఆనందంతో గంతులేశాయి.

హనుమంతుడు సుషేనుణ్ణి ఏ విధంగా తీసుకవచ్చాడో అదే విధంగా చేర్చి వచ్చాడు.

ఈ విషయమంతా రావణుడికి తెలిసింది. చేసేది లేక విషాదంతో తల బాదుకొన్నాడు. చింతిస్తూనే కుంభ కర్ణుని వద్దకు వెళ్లాడు. ఎన్నెన్నో ఉపాయాలతో అతణ్ణి లేపాడు.

కుంభకర్ణుడు నిద్రలేచాడు. సాక్షాత్తూ మృత్యుదేవతే రూపు దాల్చి కూర్చున్నదా అన్నట్లున్నాడు. రావణుని విషాదానికి కారణమేమిటని అడిగాడు.

రావణుడు తాను సీతను అపహరించుకు వచ్చాననీ, ఆ కారణంగా జరిగిన యుద్ధంలో వానరులు రాక్షస సేనలను హతమార్చారనీ, దుర్ముఖుడు, అతికాయుడు మొదలగు యుద్ధ వీరులంతా యుద్ధంలో చచ్చిపోయారనీ చెప్పాడు.

రావణుని దుష్టప్రవర్తనకు కుంభ కర్ణుడు చింతిస్తూ అన్నను చీవాట్లు పెట్టాడు. "జగజ్జనని జానకీదేవిని దొంగలించి తెచ్చిన వాడివి నీకు మేలు ఎలా కలుగుతుంది? నువ్వు చేసిన పని ఎంత మాత్రం మంచిది కాదు. నన్ను ఎందుకు లేపావు? ఇప్పటికైనా వెళ్లి రాముణ్ణి శరణు వేడుకో: హనుమంతుడు లాంటి సేవకుడు కలిగిన రాముణ్ణి మానవుడిగా ఎలా భావించావు? సరే, జరిగిపోయిందేదో జరిగిపోయింది నేను వెళ్లి ఆశ్యామ సుందరుణ్ణి దర్శనం చేసుకుంటాను!" అంటూ కళ్లుమూసుకొని రామచంద్రుణ్ణి ధ్యానించాడు.

అటు తరువాత కుంభ కర్ణుడు మస్తుగా మాంసంతిని కుండలు కుండలు కల్లు తాగాడు. పిడుగులు పడుతున్నట్టుగా గర్జించాడు. మధ్యపానమత్తుడై సైన్యం కూడా వెంట లేకుండా వెళ్లుతూ వున్న కుంభకర్ణుడికి విభీషణుడు ఎదురై పాదాలకు నమస్కరించి తన పేరు చెప్పాడు. తన చిన్న తమ్ముడు, రామభక్తుడు అని తెలుసు కున్నాడు- నువ్వు చాలా ఉత్తముడివి, రాక్షసకుల భూషణుడవు, మనోవాక్కాయ కర్మలతో రాముడినే పూజించు. కాని నేను మాత్రం కాలవశాన ఉన్మత్తుడ నయ్యాను. కనుక నువ్వు వెళ్లిపో, అంటూ కుంభ కర్ణుడు ముందుకు నడిచాడు.

విభీషణుడు చేసేది లేక తిరిగిపోయి శ్రీ రాముడికి కుంభకర్ణుని రాకను తెలియ చేశాడు.

( ఇంకా ఉంది )

# ఈశాన్యం యొక్క ప్రాశస్త్యం ఏమిటి?

శ్రీ బి. నాగభూషణ రెడ్డి, వాస్తు పరిశీలకులు, ప్రొద్దుటూరు.

యావత్తు జగత్తు పాంచభౌతిక మయింది. ఆకాశం, గాలి, అగ్ని, నీరు, భూమి అనేవి పంచభూతాలు. ఈ పంచ భూతాల గుణాలను పంచతన్మాత్ర లంటారు. అవి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు. వాటి సంబంధాలను ఈ క్రింది విధంగా తెలిసికోవచ్చు.

ఆకాశం – శబ్దం
గాలి – శబ్దం, స్పర్శ
అగ్ని – శబ్దం, స్పర్శ, రూపం
నీరు – శబ్దం, స్పర్శ, రూపం, రసం
భూమి – శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం.

భూమి యొక్క ఒక విదిశకు ఈశాన్యం అని పెద్లు ఎందుకు పేరు పెట్టారో, ఈశాన్యం యొక్క విశిష్టత, శ్రేష్ఠత ఏమిటో కొద్దిగా తెలిసికొనాలి.

సూక్ష్మాతి సూక్ష్మమైన కణాలతో యేర్పడిన అణు స్వరూపమే ఈ జగత్తు. అణువుకు వినాశం లేదు. పరమాణువునే పరమేశ్వర స్వరూపంగా వర్ణించారు ఋషులు. జీవుల ప్రాణాధారమైన నీరు ఆయన శిరముపై గంగగా, వికాసానికీ, వినాశానికి కారణమైన అగ్నిని ఆయన త్రినేత్రంగా, ప్రకృతి పురుషుల సంఘటిత శక్తినే అర్ధనారీశ్వరంగా ఒక ఆకృతిని మన ముందుంచారు మహర్షులు. మనసు వాయువునకు సంకేతం. మనసు మీద చంద్రుని ఆధిపత్యముంది. అందుకే మనసు, వాయువు, చంద్రుడు చాంచల్యానికి చిహ్నాలు. శివుడు ధ్యాన నిమగ్నుడై వున్నాడంటే చపలత్వాన్ని అరికట్టి స్థిరత్వాన్ని కల్పించడమని సూక్ష్మార్థం.

పరమేశ్వరుడి సగం శరీరం పరమేశ్వరి. ఈశాన్యం అంటే పరాశక్తి, పరమేశ్వరుల సంగమస్థానమైన విదిశ. పరాశక్తిని ఫేస్‌గా, పరమేశ్వరుని న్యూట్రల్‌గా పోల్చవచ్చు. ఫేస్, న్యూట్రల్ రెండును కలసినప్పుడే విద్యుచ్ఛక్తి పనిచేస్తుంది. ఉత్తర ఈశాన్యం మాతృస్థానమనీ, తూర్పు ఈశాన్యం పితృస్థానమనీ అన్నారు ఆర్యులు. ప్రకృతి పురుషుల కలయిక వల్లనే సృజనాత్మక శక్తి ఉత్పన్నమవుతోంది. అందుకే ఈశాన్యం సక్రమంగా వుంటే సృష్టి స్థితులు కలుగుతాయి గృహస్థులకు. ఇక్కడ "సృష్టి" అంటే సంపత్తి. సంతతిప్రాప్తి అనీ, "స్థితి" అంటే ఆస్తి, క్షేమమనీ అర్థం గ్రహించాలి. ఈశాన్యం లోపిస్తే "లయం" (నాశం) కలుగుతుందని అన్నారు.

ఇల్లు కట్టుకొనే స్థలాలలో తూర్పు పడమరలకు పొడవున్న స్థలాలు, ఉత్తర దక్షిణాలకు పొడవున్న స్థలాలు వున్నవి. తూర్పు పడమరలకు పొడవున్న స్థలం ఉత్తమ మయిందని దీనిని ప్రథమ స్థానం

ఇవ్వబడింది వాస్తు శాస్త్రంలో. ఉత్తర దక్షిణములకు పొడవున్న స్థలానికి ద్వితీయ స్థానం ఇవ్వబడింది. ఎందుకు?

ఏ స్థలమైనను పొడవు వెడల్పులు 2:1 నిష్పత్తిలో ఉండడం శ్రేష్టం. అంటే 100 అ॥ పొడవుంటే 50 అ॥ వెడల్పుండాలి. ఇంతకు లోపించి వుండినను అది పనికిరాదని కాదు. ఉత్తమమైనది కాదని మాత్రమే అనుకోవాలి. స్థలం యొక్క ఆకృతికి అనుగుణ్యంగా గృహాన్ని నిర్మించుకోవాలి. కట్టిన ఇంటిలో ఏవో కొన్ని సమస్యలు కలిగినంత మాత్రాన దాన్ని కూల్చాలి అని అనుకొనడం అర్థరహితం.

## తూర్పు పడమరలకు పొడవున్న స్థలం యొక్క ప్రాముఖ్యత ఏమిటి?

ఉ.వా. | ఉత్తరము | ఉ.ఈ.
ప.వా. | పడమర | ప.నై.
తూ.ఈ. | తూర్పు | తూ.ఆ.
ద.నై. | దక్షిణము | ద.ఆ.

తూర్పు పడమరలకు పొడువున్న ఈ స్కెచ్ లో ఉత్తరము మరియు ఉత్తర ఈశాన్యము ఎక్కువ కొలతలును, తూర్పు మరియు తూర్పు ఈశాన్యము తక్కువ కొలతయు వున్నట్లు స్పష్టంగా తెలుస్తోందికదా? ఉత్తర దిశాధిపతి కుబేరునకు, ఈశానునకును స్నేహం. సంపద సమృద్ధిగా వుంటుంది. కుబేరుని ఆధిపత్యం కావున భాగ్యమెంతున్నా భోగం అంతగా అనుభవించ లేరు ఈ స్థలం లోని గృహ యజమానులు.

ఉ.వా. | ఉత్తరము | ఉ.ఈ.
ప.వా. | పడమర | ప.నై.
తూ.ఈ. | తూర్పు | తూ.ఆ.
ద.నై. | దక్షిణము | ద.ఆ.

ఉత్తర దక్షిణములకు పొడవున్న ఈ స్కెచ్ లో తూర్పు మరియు తూర్పు ఈశాన్యము ఎక్కువ కొలతలును, ఉత్తరము మరియు ఉత్తర ఈశాన్యం కొలతలు తక్కువగును ఉన్నవి. తూర్పు దిశాధిపతి ఇంద్రుడు. ఇంద్రుని ఆధిపత్యం కావున భోగం (LUXURY) బాగా వుంటుంది.

ఈశానం అంటే వెలుగు అని అర్థం. అందుకే ఈశాన్యం లోపిస్తే ఆర్థికంగా, ఆరోగ్యపరంగా వెలుగు తొలగుతుందన్నారు పెద్దలు. ఈశ్వర స్థానం సక్రమంగా వుంటే నశ్వరం (నశించుట) వుండదు. కానీ ఒక్క ఈశాన్యం చక్కబరచుకొంటే సరిపోతుందనుకోవడం సరికాదు. అష్టదిశలు కూడా సక్రమంగా వున్నప్పుడే సుఖమయ జీవనం సమకూరుతుంది.

# యజ్ఞములు - విశ్వకళ్యాణము

బ్రహ్మశ్రీ అయిలా వఝల రామకృష్ణ శాస్త్రి

భారత దేశము పవిత్ర పుణ్యభూమి. భారతీయులకు భగవంతుడు ప్రసాదించిన అమృత భాండాగారము. వేదవాఙ్మయము, సనాతన భారతీయ, ఆధ్యాత్మిక, వైజ్ఞానిక వాఙ్మయమంతయు, వేద, స్మృతి, పురాణములయందు నిగూఢమై యున్నది. వేదము, కర్మకాండ, జ్ఞానకాండ, ఉపాసనా కాండ అని మూడు విధములుగ విభజింప బడినది. ఐహికా ముష్మిక సాధన మార్గములగు అగ్నిష్టోమ, అతిరాత్ర ఆప్తోర్యామ సాంతపన వాజపేయ పౌండరీక అశ్వమేధాది క్రతువులు (యజ్ఞములు) అనేకములు కర్మకాండయందు చెప్ప బడినవి. జ్ఞానకాండ యందు బ్రహ్మ సాక్షాత్కారమునకు అనుకూలమగు మార్గములు. ఉపాసనాకాండయందు భక్తిజ్ఞాన వైరాగ్య మార్గములు వివరింప బడినవి.

## యజ్ఞ శబ్దార్థ విచారము

యజ దేవపూజా సంగతి కరణదానేషు. యజ్ఞములనగా దేవతలను ఆరాధించు (పూజించు) మార్గమును ఉపదేశించు మార్గములు క్రియలు గలవి అని అర్థము. ఈ యజ్ఞములు భగవద్గీత నాల్గవ అధ్యాయమునందు శ్రీకృష్ణపరమాత్మ ద్వారా భక్తుడగు అర్జునునకు తెలుప బడినవి.

ద్రవ్య యజ్ఞా స్తపో యజ్ఞా
యోగ యజ్ఞా స్తథా పరే ।
స్వాధ్యాయజ్ఞాన యజ్ఞాశ్చయతయ
స్సంశిత వ్రతాః ॥

శ్రద్ధా భక్తి సంపన్నులు, కార్యదీక్షా పరులునగు సాధకులు ద్రవ్య యజ్ఞము లను, తపో యజ్ఞములను, యోగ యజ్ఞములను, స్వాధ్యాయ యజ్ఞములను, జ్ఞాన యజ్ఞములను ఆచరించుచున్నారు.

పుణ్య స్థలము, తీర్థముల యందు, ధర్మశాలలు అన్నసత్రములు, అనాథ శరణాలయములు, దేవాలయములు ప్రతిష్టలు, విద్యామందిరములు, తటాకములు, బావులు, ఇత్యాదులు మరియు అగ్నిష్టోమాది క్రతువులు ద్రవ్య సాధ్యములగు యజ్ఞములు అనబడును.

కఠినములగు నియమములతో, ఉప వాసాది క్లేశములతో ఆచరింపబడు, చాతుర్మాస్య వ్రతములు, కృచ్ఛ చాంద్రా యణాది నియమములు పత్రములు శాకములు. వాయువు ఆహారముగ తీసి కొని, ఆచరించు కఠోర వ్రతములు తపోయజ్ఞములనబడును.

పాతంజల యోగ సూత్రానుసారము ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన, ధారణ, సమాధి మొదలగు అష్టాంగ యోగ మార్గ ముల ద్వారా సాధింపబడు యోగ మార్గ సాధనలు యోగ యజ్ఞములని చెప్ప

బడును. స్వాధ్యాయ యజ్ఞములనగా ఋగ్వేదము, యజుర్వేదము (శుక్లయజుర్వేదము) సామవేదము, అధర్వణ వేదము, బ్రహ్మసూత్రములు, అష్టోత్తర శతోపనిషత్తులు (108) భగవద్గీత, ఇత్యాది వేదాంత, వైదిక గ్రంథములను పారాయణము చేయుట స్వాధ్యాయ యజ్ఞమనబడును. గురు శుశ్రూష చేసి శాస్త్రాధ్యయన సంపన్నుడై ఇంద్రియ వ్యామోహమునకు లోబడక దైవమిట్టిదని తెలిసికొని ఆనందించుట జ్ఞాన యజ్ఞమనబడును. ఈ యజ్ఞములన్నియు అనేక విధములుగ బ్రహ్మ దేవుని వలన వెలువబడియున్నవి. ఇవి అన్నియు వస్తువులు, సాధకులు, కాలము మొదలగు ఉపకరణములతో శ్రమతో కూడి యున్నవి.

వీని అన్నింటిలోను జ్ఞానయజ్ఞము చాల శ్రేష్ఠమైనది. కాని ఈ యజ్ఞము లన్నియు చిత్తశుద్ధిని కలిగించి, మనస్సును పవిత్రము చేసి, దైవ దృష్టికి మరలించును గనుక యజ్ఞములన్నియు ముఖ్యములై యున్నవి.

## యజ్ఞముల వలన దేవతలకు మనుష్యులకు సంబంధము

యజ్ఞములు చేసి దేవతలను తృప్తి పరచినప్పుడు దేవతలు సంతోషించి వర్షమును కురిపించి మానవులకు సకల జీవరాశికి మహోపకారము చేయుచున్నారు. యజ్ఞములలో సమిధలు, నెయ్యి హవిస్సు (హోమము చేయుటకై వండిన పాయసము అన్నము ఇత్యాదులు) వీనితో హోమము చేయుదురు. ఏ దేవతను గూర్చి హోమము చేయుచున్నామో ఆ దేవతకు మనము హోమము చేసిన సమిత్, ఆజ్యము, హవిస్సు వీనిని యజ్ఞేశ్వరుడు అందించుచున్నాడు అందువలన యజ్ఞేశ్వరునకు హవ్యవాహనుడు అను పేరు సార్థకమై యున్నది. ఈ విధముగ దేవతలు హవిస్సును భుజించి వర్షాదుల ద్వారా విశ్వమునకు మహోపకారము చేయుచున్నారు. కనుక దేవతా ప్రీతికరముగ చేయు యజ్ఞమును విశ్వశాంతిని, లోక కల్యాణమును ప్రసాదించుచున్నవి. ఈ విషయము భగవద్గీతలో చెప్పబడి యున్నది.

దేవాన్ భావయతాఽనేన తేదేవా
భావయంతువః ।
పరస్పరం భావయంతః శ్రేయః
పరమవాప్స్యథ ॥

## పంచ మహాయజ్ఞములు

మరియు ఐదు మహాయజ్ఞములు ఆచరింపవలశియున్నవి. దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్య యజ్ఞము, బ్రహ్మ యజ్ఞము, దేవతలను గూర్చి చేయు యజ్ఞము దేవయజ్ఞము. అనగా నెయ్యి, సమిధలు, హవిస్సుతో దేవతలకు హోమము చేయబడునది. ప్రతి రోజు వైశ్వ దేవము అను యజ్ఞము భోజనమునకు ముందు అగ్నిలో హోమము చేసి, ఆ అన్నమును పక్షులకు బలిగా వేయవలయును. ఇది దేవ

యజ్ఞము.

పితృయజ్ఞమనగా మనకు జన్మను ప్రసాదించిన తల్లిదండ్రులు జ్ఞానోపదేశము చేసిన గురువులు, వంశ పురుషులకు, శ్రాద్ధ దినములందును, సుక్రమణ పర్వ దినముల యందును తీర్థయాత్రల యందును, పితృదేవతలను గూర్చి చేయు పిండ ప్రదానాదులు పితృ యజ్ఞము అనబడును.

భూతయజ్ఞమనగా పశుపక్ష్యాదులు, క్రిమికీటకాదులకు ప్రాత స్సాయంకాల ములయందు, భోజనాత్పూర్వము చేయు చిత్రగుప్త బలివాయసపిండము (కాకికి వేయు అన్నము) ఇత్యాదులు భూత యజ్ఞములు. మనుష్య యజ్ఞమనగా భోజన కాలమునకు తటస్థపడిన అతిథులు, అభ్యాగతులు, సాధువులు, సత్పురుషులు, భిక్షగాండ్రు మొదలగు వారికి చేయు అన్న దానము మనుష్య యజ్ఞమనబడును.

బ్రహ్మయజ్ఞమనగా తన కులాచార ధర్మమననుసరించి, ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదములయందు ప్రతిదినము ఒక అను వాకము లేక ఒక ఋక్కును పారాయణ చేయుట బ్రహ్మ యజ్ఞమనబడును.

వేదములు, వేదార్థములను బోధించు ఉపనిషత్తులు విష్ణు సహస్ర నామము భగవద్గీత ఇత్యాది గ్రంథములను ప్రతి నిత్యము యధాశక్తి పారాయణము చేయుట బ్రహ్మయజ్ఞమనబడును.

ఈ ఐదు యజ్ఞములను వైదిక ధర్మ మార్గమునందు ఆసక్తిగల ప్రతి భారతీ యుడు తప్పక ఆచరింపవలయును.

పూర్వోక్తములగు ద్రవ్యయజ్ఞాదులు కేవలము ద్రవ్యసాధ్యములగు చున్నవి. యజ్ఞ, యాగాది క్రతువుల యందు దైవారాధనము ముఖ్యమైనది. భగవంతుని ఆరాధించుటకు 4 మార్గములు చెప్పబడి యున్నవి. 1) జపము. 2) అర్చనము. 3) ధ్యానము 4) హోమము. ఈ మార్గములు ఉత్తమోత్తమములు, జపము, బాహ్యజపము, మానసిక జపము అని రెండు విధములు. సామూహికముగ ఉచ్చైస్స్వరముతో చేయు భజనలు పారాయణములు, బాహ్యములు. మానసికముగ చేయు జపము చాల ముఖ్యమైనది. అర్చనమునందు పూజా సామాగ్రి అవసరమగు చున్నది. పుష్ప ములు, ఫలములు, పంచామృతములు, నారికేళము, ధూపదీప నైవేద్యములు మొదలగునవి అవసరమగును. హోమము నకు ఆజ్యము, సమిధలు, పాయసము, ఇత్యాదులు ముఖ్యములు. ధ్యానమునందు ఇట్టివి ఉపయోగింపనవసరము లేదు.

ధ్యానము కేవలము మానసికముగా ఆచరింపబడునది. ధ్యానము నందు ఏకాగ్రత లభించుటకు ముందు జప, అర్చన, హోమ విధానములన్నియు తప్పక ఆచరింపవలయును. జ్ఞాన యజ్ఞమునకు ఎట్టి వస్తు సముదాయము అవసరము లేదు. కాని ఈ కర్మకాండ అంతయు జ్ఞాన యజ్ఞమునకు పునాది వంటిది. పునాది లేనిదే సౌధము నిర్మింప జాలము కదా! కనుక జ్ఞాన ప్రాప్తి కొరకు కర్మ కాండను తప్పక ఆచరింపవలయును.

విశ్వశాంతి, లోక కల్యాణమునకై చేయ బడు, ఈ యజ్ఞములయందు, ప్రతివారు యథాశక్తి యజ్ఞ ద్రవ్యములను సహాయము చేయవలయును. ప్రతికార్యము ధనము లేనిదే జరిపించుటకు సాధ్యము కాదు. మనము స్వయముగ యజ్ఞములను చేయ జాలక పోయినను యజ్ఞములను జరిపించు చున్నవారికి సహాయపడి పూర్వజన్మార్జిత మగు ధనమును సద్వినియోగము చేయ వలయును.

చత్వారోధన దాయాదాః ధర్మాగ్ని
నృపతస్కరాః ।
తేషాంజ్యేష్ఠావ మానేన త్రయః
కుప్యంతి సోదరాః ॥

మనము సంపాదించిన ధనమునకు నలుగురు దాయాదులు ఉన్న విషయ మును తెలుసుకొనవలయును. ధర్మము, అగ్ని, రాజు, దొంగ వీరు ఈ నల్గురు దాయాదులు. వీరిలో ధర్మము ఒక వైపు, మిగిలిన రాజు, అగ్ని, దొంగ ఒక వైపు ఉండెదరు. ఈ ముగ్గురు తీవ్రవాదులు. అయినను వీరియందు ఒక మంచి ఉద్దేశ్యము కలదు. పెద్దవాడగు ధర్మము అను దాయాదియందు వీరికి గొప్ప అభిమానము కలదు. వీరు దుర్మార్గులు ఐనను ఎవడు మంచి హృదయముతో దానధర్మములను, పుణ్యకార్యములను ఆచరించునో అట్టివానికి ఎన్నడును అప కారము చేయజాలరు. కనుక ధర్మ కార్య ములను చేయువారికి ఎన్నడును ఎట్టి ఆపదలు తటస్థించవు. యజ్ఞములను చేయుటవలన పాపము నశించి పుణ్యాము అభివృద్ధి చెంది, ధర్మము నాల్గు పాదము లతో రాణించును. భగవంతుని తెలుపు మార్గములలో ధర్మము ప్రధానమైనది. ధర్మస్య ప్రభురచ్యుతః అనగా ధర్మమునకు ప్రభువు భగవంతుడు గనుక దైవ దృష్టి కలవారు. తప్పక ధర్మమును ఆచరింప వలయును. ధర్మాచరణమువలను ధర్మాది పతియగు శ్రీమన్నారాయణుని అను గ్రహమును పొందగలము. భగవంతుడు యజ్ఞ ఫల ప్రదుడు. ఏ యజ్ఞములను ఆచరించినను ఫలమును ప్రసాదించువారు శ్రీనారాయణమూర్తి. యజ్ఞములవలన మనస్సు ప్రశాంతి చెందును. దేవతలు సంతోషించి వర్షము కురిపించి దేశమును సస్యశ్యామలమొనరించెదరు. సర్వసస్య సమృద్ధి వలన పిపీలికాది బ్రహ్మపర్యంతము గల ప్రాణికోటి అంతయు సంతృప్తిని చెంది ఆనందోత్సాహములతో ఓల లాడును గనుక యజ్ఞములు విశ్వశాంతికీ లోకకల్యాణమునకూ అవశ్యము ఆచరింప వలసియున్నవి. ఓం తత్సత్.

## వివాహం

ఢిల్లీ వాస్తవ్యులూ, రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య మాజీ అధ్యక్షులు శ్రీ ఆలపాటి వెంకటేశ్వర రావు గారి కుమారులు చి॥ ప్రవీణ్ కుమార్, యం.బి.ఏ., గారి వివాహం, హైద్రాబాద్ వాస్తవ్యులు, ప్రముఖ పారిశ్రామికవేత్తలూ శ్రీ జి. హనుమంత రావు గారి కుమార్తె చి॥ హిమబిందుతో 2.3.1994వ తేదీన సికింద్రాబాద్ లోని 'తివోలీ గార్డెన్స్'లో వైభవంగా జరిగింది.

# రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య దశాబ్ది ఉత్సవాలు

1984లో స్థాపించబడిన రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య ఈ 1994కు పదియేండ్లు పూర్తిచేసుకొంది. ఈసందర్భాన్ని పురస్కరించుకొని 20.2.1994 ఆదివారం సాయంత్రం 5 గంటలకు ఈ సంస్థ దశాబ్ది ఉత్సవాలను ఘనంగా చేసుకొంది. హైద్రాబాద్ లోని కాచిగూడ వైశ్య హాస్టల్లో జరిగిన ఈ ఉత్సవాలు ఆంధ్ర ప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ ప్రధాన కార్యదర్శి శ్రీ ఓరుగంటి బాల క్రిష్ణయ్య శ్రేష్ఠి గారు జ్యోతిని వెలిగించుటతో ప్రారంభమయ్యాయి. ఆంధ్ర ప్రదేశ్ ఆర్థిక, వైద్య, ఆరోగ్య, శాసన సభావ్యవహారాల శాఖామాత్యులు శ్రీ కె.రోశయ్య గారు ఈ ఉత్సవాలకు ముఖ్య అతిథిగా విచ్చేశారు. 'పెన్షనర్స్ బంధు' శ్రీ జి.నారాయణ శ్రేష్ఠి గారు ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ముద్రించిన ప్రత్యేక సంచికను ఆవిష్కరించగా, ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు శ్రీ కొత్తూరు సీతయ్య గుప్త గారు ఈ సంస్థ ముద్రించిన "భాగ్య నగరములో వైశ్యులు – వైశ్య సంస్థలు" అను పుస్తకాన్ని ఆవిష్కరించారు. తదుపరి ముఖ్య అతిథి, మంత్రివర్యులు శ్రీ కె.రోశయ్య గారు ఈ క్రింది ప్రముఖులకు బిరుదులను ప్రధానం చేశారు.

## బిరుద ప్రదానాలు సన్మానాలు

1. డాక్టరు సుంకు బలరాం, హైద్రాబాదు గారికి – పారిశ్రామికవేత్త; 2. శ్రీ మీలా సత్యనారాయణ, సూర్యాపేట గారికి – పారిశ్రామికవేత్త; 3. శ్రీ విసంశెట్టి అయోధ్యరాములు గుప్త, సికింద్రాబాదు గారికి – పారిశ్రామికవేత్త 4. శ్రీ మేడా నరసింహులు, బి.ఇ., హైద్రాబాద్ గారికి – నిర్మాణరత్న; 5. శ్రీమతి జూలూరు వజ్రమ్మ, సికింద్రాబాద్ గారికి– దానశీల; 6. శ్రీ మండే సత్యనారాయణ మూర్తి, నరసాపురం గారికి – దానశీల; 7. శ్రీ రుద్రంగి రామయ్య, హైద్రాబాదు గారికి – దానశీల; 8. శ్రీ జి.వి. గున్నయ్య శెట్టి, మచిలీపట్నం గారికి – వైశ్యబంధు; 9. శ్రీ జి.నారాయణ రావు, ఐ.ఏ.యస్.,(రిటైర్డు) హైద్రాబాద్ గారికి – ప్రజాబంధు; 10. శ్రీ బట్టు గోపాల్ మేల్లశం, బి.ఎ., యల్.యల్.బి., జగిత్యాల గారికి – సంఘోద్ధారక; 11. శ్రీ ముక్కా చంద్రశేఖరు గుప్త, నిజామాబాదు గారికి – వైశ్యబంధు; 12.శ్రీ వనపర్తి యాదగిరి, దేవరకొండ గారికి – వైశ్యబంధు; 13. శ్రీ కూరపాటి క్రిష్ణమూర్తి, విజయవాడ గారికి – సంఘోద్ధారక; 14. శ్రీ గట్టు వీరేశం,

బి.కాం., యంసిఏ, హైదరాబాదు గారికి – సంఘశ్రీ; 15. శ్రీ మునుగోటి యాదయ్య ఎం.ఓ.యల్., ఇబ్రహింపట్నం గారికి – వైశ్య బంధువు; 16. శ్రీ చింతల శ్రీనివాసు, ఎం.ఏ., ఎల్.ఎల్.బి., హైదరాబాదు గారికి– కవిరత్న.

ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ అధ్యక్షులు శ్రీ కె.వి. రమణయ్య గారు ఈ క్రింది ప్రముఖులను సన్మానించారు.

1. శ్రీమతి గ్రంధి మాధవి, బి.ఏ. బి.యల్ మరియు మాజీ ఎం.యల్.ఏ., హైదరాబాదు; 2. శ్రీమతి ఎన్. ప్రమీళా గుప్త గారు, సికింద్రాబాదు; 3. శ్రీమతి పాలికె అనంత లక్ష్మి గారు, సికింద్రాబాదు; 4. శ్రీమతి బంగారు సుజాత శేఖర్, ఎం.ఏ., బి.ఇడి., కవయిత్రి, దేవరకొండ; 5. కవిభూషణ శ్రీ ఎర్రా విశ్వనాధం గుప్త, ఖమ్మం; 6. శ్రీ సామా కాశీనాధ్ గారు, సికింద్రాబాదు; 7. శ్రీ సి.వి.కె. శ్రీనివాసులు గారు, సికింద్రాబాదు; 8. శ్రీ బూర్ల సూర్య ప్రకాశ్ రావు, సికింద్రాబాదు; 9. సంఘోద్ధారక శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి గారు, కడప; 10. శ్రీ ఎం.ఆర్.కే. మూర్తి గారు, నర్సరావు పేట; 11. శ్రీ వేముల రామక్రిష్ణ గారు, హైదరాబాదు; 12. శ్రీ వి.రాజమౌళి గారు, లగిశెట్టిపేట; 13. శ్రీ గుడివాడ జయరాములు గారు, గుంటూరు.

తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయములో వైశ్యుల గురించి పరిశోధన చేస్తున్న శ్రీ చింతల ద్వారకానాధ్, ఎం.ఎ., గారిని అమాత్య శేఖరులు శ్రీ రోశయ్యగారు ఈ సంస్థ పక్షాన వెయ్యి రూపాయల నగదుతో సత్కరించారు. ఈసంస్థ వ్యవస్థాపకులు శ్రీ కె.సి. గుప్త గారు ఈసంస్థ నిర్వహించు చున్న కార్యక్రమాలను వివరించారు.

## కల్యాణ దుర్గములో 'గుప్తా శిల్క్స్' ప్రారంభం

అనంతపురానికి చెందిన పై పట్టణము లో శ్రీ యల్.సి. వెంకటేశ్ గుప్తా గారి యజమాన్యమున సమర్థవంతంగా నిర్వహించబడుచున్న గుప్తా టెక్స్‌టైల్స్ వారు "గుప్తా శిల్క్స్" అను ఒక వ్యాపార సంస్థను 2.3.1994వ తేదీన ప్రారంభించారు.

## వివాహం

విజయవాడ పుర ప్రముఖులు, శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవా లయాలు, ఆర్యవైశ్య ధర్మ సంస్థల సమాఖ్య ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యక్షులూ శ్రీ గడ్డం సుబ్బరావు గారి కుమార్తె చి॥ వరలక్ష్మి వివాహం, ఖమ్మం వాస్త వ్యులు కీ॥ శే॥ సానే శ్రీరాములు గారి కుమారులు చి॥ ఉదయ ప్రతాప్‌తో 27.2.9494వ తేదీన విజయవాడ లోని శ్రీ కన్యకా పరమేశ్వరీ విస్సం శెట్టి వెంకటరత్నం హిందూ హై స్కూలులో వైభవంగా జరిగింది.

# రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్యకు నూతనాధ్యక్షులు



హైదరాబాద్ ప్రధాన కార్యస్థానంగా గల రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య సర్వ సభ్య సమావేశము - ఎన్నికలు 27.2.1994వ తేదీ ఆదివారం, హైదరాబాద్ కాచిగూడ - వైశ్య హాస్టల్ సభాభవనములో జరిగినవి. హైదరాబాద్ పుర ప్రముఖులు, మంచి పేరున్న కంట్రాక్టరు, స్నేహ సౌజన్య శీలి "నిర్మాణ రత్న" శ్రీ మేడా నరసింహులు గారు ఈ ఎన్నికల్లో ఈ సంస్థకు నూతన అధ్యక్షులుగా ఎన్నికయ్యారు.

విజయవాడ పట్టణములోని ప్రముఖ సేవా సంస్థ "వాసవి" ప్రచురించి విడుదల చేసిన, వివాహ పరిచయ సంచిక - జనవరి 1994, ఆరవ సంపుటి మా కార్యాలయం చేరింది. ఇందులో పెండ్లికి సిద్ధముగా ఉన్న వధూ-వరుల పేర్లు, కావలసిన అన్ని వివరాలతో ముద్రించబడినాయి. 20 పుటలతో అందంగా ఉన్న ఈ పుస్తకము ప్రయోజనము విలువ కట్టుటకు వీలు కానిది. వధూ-వర పరిచయ వేదికల నిర్వహణ కన్నా; ప్రతి గ్రామము లేక పట్టణముల లోని ఆర్యవైశ్యసంఘాలు- ఇటువంటి పట్టికలను తయారుచేసి అవసరమైన వారికి అందించగలిగితే ఎంతో మేలు. ఇతర వైశ్య సంఘాలు ఈ 'వాసవి' కృషిని ఆదర్శంగా తీసుకొంటా యని ఆశిస్తున్నాం.

## వేదాంత శిబిరము

వేదాంత శిబిరము అమెరికన్ ఫ్రెండ్‌షిప్ స్కూల్, గుడిబండ, కోలార్ జిల్లా, కర్నాటక స్టేట్ (హిందూపురం దగ్గర) నందు జరుగును. శ్రీశ్రీశ్రీ కైవల్య చైతన్య గారిచే శిబిరములో 5.5.94 నుండి 15.5.94 వరకు వేదాంత ప్రవచనములు చేయబడును. శిబిరములో పాల్గొనుటకు ఆసక్తిగల వారు వివరములకు క్రింది అడ్రసుకు వ్రాసేది.

అడ్రసు : ఫోన్ : 22794

డి. ఎన్. విజయమాలా,
గీతామందిరము, దొడ్డపేట,
కోలార్ - 563 101.
కర్నాటక స్టేట్.

# పొట్టి     ముల జిల్లా లేక పొట్టిశ్రీరాముల యూనివర్సిటీ కొరకు ప్రజా పోరాటం అవసరం

ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి ఆత్మ త్యాగం చేసిన అమరజీవి పొట్టి శ్రీరాముల పేరును నెల్లూరు జిల్లాకుగానీ, లేక తెలుగు యూనివర్సిటీకి పొట్టిశ్రీరాముల యూనివర్సిటీగా పేరుపెట్టాలని అనంతపురం జిల్లా నుండీ ఒక తీర్మానాన్ని 1993లో ఆం.ప్ర. ఆర్య వైశ్య మహాసభలో ప్రతిపాదిస్తే అయ్యేపని గాదని త్రోసిపుచ్చింది. 1994 మార్చి లోగా ఈ విషయమై ప్రభుత్వం నిర్ణయించక పోతే ఏప్రెలు నెల నుండీ రాష్ట్ర వ్యాపితమైన కార్యక్రమం చేపట్టుటకు నెల్లూరు ఆర్యవైశ్య సంఘం హెచ్చరించడం, దానిపై రాష్ట్ర వైశ్య మహాసభ స్పందించడం హర్షదాయకం. ఈ కార్యక్రమం ఒక కుల సంఘ పోరాటంగా భావించరాదు. ఇది ప్రజాసమస్య. జాతీయ సమస్య. ఒక త్యాగికీ, పైగా గాంధేయ వాదికీ ఆంధ్రజాతి ఇవ్వాల్సిన పారితోషికం. ఏ ఉద్యమమూ లేకనే రంగారెడ్డి జిల్లా వెలిసింది. ప్రకాశం జిల్లా ఏర్పడింది. దళితుల పోరాటంతో అంబేద్కర్ విగ్రహాలు దేశమంతా వెలిసినవి. కానీ విప్లవ వీరుడు అల్లూరి సీతారామరాజు పేరుతో పశ్చిమగోదావరి జిల్లా. గాంధేయవాది పొట్టి శ్రీరాముల పేరున నెల్లూరు జిల్లా మారవలసిన అవసరం వుంది. అల్లూరి సీతారామరాజు, గాంధేయ వాది పొట్టి శ్రీరాముల పేర్లతో పద్మశ్రీ అవార్డులు మన ప్రభుత్వం ఎప్పుడో ప్రకటించవలసి వుండినది.

ఇప్పుడైనా రాష్ట్ర ప్రభుత్వం ఆ పని చేయాలి. ఆంధ్రప్రదేశ్ ఆర్య వైశ్య మహాసభ జాగృతమై అన్ని ప్రజా సంఘాలనూ, రాజకీయ పార్టీలనూ కదిలించి, ఐక్యపోరాటానికి సమాయత్తం కావడం ఎంతైనా అవసరం. ఇది ప్రజా వుద్యమంగా ముందుకు తీసుకొని పోవలసిన పవిత్ర బాధ్యతగా అన్ని రాజకీయ పార్టీలు గుర్తించవలసి వుంది.

ఇట్లు
బి. వెంకట సుబ్బయ్య
ప్రధాన కార్యదర్శి,
ఆంధ్రప్రదేశ్ రిటైర్డ్ టీచర్ల సంఘం,
కుంటిమద్ది.

## కొత్తూరు ఆర్యవైశ్య యువజన సంఘానికి నూతన కార్యవర్గము

అనంతపురము కొత్తపూరుకు చెందిన పై యువజన సంఘం సర్వసభ్య సమావేశము 30.1.94వ తేదీన జరుగ క్రింది వారలు నూతన కార్యవర్గసభ్యులుగా ఎన్నికయ్యారు. అధ్యక్షులు శ్రీ బచ్చు నాగప్రసాద్, ఉపాధ్యక్షుడు శ్రీ గరికపాటి వెంకట కృష్ణమూర్తి, కార్యదర్శి శ్రీ జయం మురళీ మోహన్, సహాయ కార్యదర్శులు శ్రీ బండారు సతీష్ గుప్త, శ్రీ పెండేకంటి బాలాజి కోశాధికారి శ్రీ కోవూరు వెంకట సుకుమార్.

## నీతి లేని రాజకీయం

శ్రీమతి లక్ష్మీ మోహన్

నీతి లేని రాజకీయం నిలువునా
దహించే నిప్పు లాంటిది!
అది జాతిని తగుల బెట్టుటకే కాని
సేవలందించ డానికి కాదు!
అవి జాతి పురోభివృద్ధికి
గొడ్డలిపెట్టు అయ్యాయి.
తాము కష్టించకుండా
సుఖపడాలనే తలంపుతో
జాతి నేతలు (నాయకులు)
పదవుల్ని చేపడితే
బలై పోతున్నది అమాయక ప్రజానీకం!
స్వార్థాన్ని పరమార్థంగా భావించే
రాజకీయ నాయకులు...
నేడు జాతి గౌరవం పట్ల నిర్లక్ష్యం
స్త్రీలపై అత్యాచారం
నిరంకుశ పరిపాలనా విధానం
లంచగొండితనం, దోపిడీతనం
నేటి రాజకీయ రథ చక్రాలు!
ఏమి? ఆశించి గద్దెకెక్కిస్తున్నారు
ప్రజలు వీరిని?
నోరు మెదప లేని అభాగ్యుల గతి ఏమిటి?
మరి ఇంకా కానరాదేమి?
నవసమాజ నిర్మాణం కోసం
తిరుగు బాటు ప్రభంజనం
ఆగకూడదు న్యాయం కోసం
మన పోరాటం
అరాచకం అంతం అయ్యేదాకా
ఎలుగెత్తి చాటాలి!
కావాలి మనదే అంతిమ విజయం!

## నరసింహ్మాలు గారికి అవార్డు రావడం ముదావహం

ఆర్యా!

వైశ్య ప్రబోధిని ఫిబ్రవరి సంచికలో శ్రీ మేడా నరసింహ్మాలు గారికి నేషనల్ యూనిటీ అవార్డు వచ్చిన విషయం చదివి సంతసిస్తున్నాము. ప్రసిద్ధ పుణ్య క్షేత్రమైన ఎగువ అహోబిళములో ఆయన చేసిన సేవలు అపూర్వము. వారికి యిటువంటి అవార్డు రావడం ముదావహం.

చిట్టిప్రోలు కృష్ణమూర్తి
నడికూడి, గుంటూరు జిల్లా.

## దోమా వెంకట స్వామి గుప్త గారి రచనలు పంపండి

మహాకవులు, అవధాని శేఖరులు కీ॥ శే॥ దోమా వెంకటస్వామి గుప్త గారి అవధాన పద్యాలు కానీ, వారి ఇతర రచనలు కానీ కలవారు వెంటనే ఈ క్రింది అడ్రసుకు పంపి సహకరించ గోరుచున్నాము.

శ్రీ దోమా వెంకట స్వామి గుప్త
సాహిత్య పీఠము, వైశ్యప్రబోధినీ
కార్యాలయం, జయనగర్ కాలనీ,
కడప – 516 002.

– పి. ల.
ప్రధానకార్యదర్శి.

## వివాహములు

కర్నూలు జిల్లా నంద్యాల వైశ్య ప్రముఖులు శ్రీ గంగిశెట్టి సుబ్బరాయుడు గారి పుత్రిక చి॥ అరుణా దేవి వివాహం, అనంతపురం వైశ్య ప్రముఖులు శ్రీ గూడూరు చిన్నరామయ్య గారి ప్రథమ పుత్రుడు చి॥ వెంకటరమణ గారితో 27.2.94వ తేదీన నంద్యాలలోని శ్రీమతి కశ్శెట్టి సుబ్బమ్మ అండ్ శ్రీ బాలాజీ కళ్యాణ మంటపములో వైభవంగా జరిగింది.

కర్నూలు వైశ్య ప్రముఖులు శ్రీ పుల్లగూర రామ కృష్ణయ్య గారి కుమార్తె చి॥ నాగజ్యోతి లక్ష్మి వివాహం, సదరు పట్టణ వాస్తవ్యులు కీ॥ శే॥ కె. అనంతయ్య శ్రేష్ఠి గారి కుమారులు చి॥ విజయ కుమార్, బి.ంకాం., గారితో 2.3.94వ తేదీన కర్నూలు పూల బజారు లోని శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయ ములో వైభవంగా జరిగింది.

కర్నూలు జిల్లా ఆదవేణి పట్టణ వైశ్య ప్రముఖులు శ్రీ పి.పి.ఇ. బసవరాజు శ్రేష్ఠి గారి కుమారులు చి॥ ఇ. వేణుగోపాల్ శ్రేష్ఠి గారి వివాహం, కర్నాటక రాష్ట్రానికి చెందిన షాబాద్ వాస్తవ్యులు శ్రీ మాణిక్ రావు - ఆర్.గుమ్‌డాల్ గారి కుమార్తె చి॥ అనితతో 9.4.1994వ తేదీన ఆదవేణి పట్టణములోని శ్రీ వాసవీ కల్యాణ మంటపములో వైభవంగా జరిగింది.

అనంతపురం జిల్లా గుంతకల్లు వైశ్య ప్రముఖులు శ్రీ మంచికంటి సత్యరంగయ్య గారి కుమారులు చి॥ ప్రసాద్, యం.బి.ఎ., గారి వివాహం, చిలకలూరిపేట శ్రీ రామ హరినాధ బాబు గారి కుమార్తె చి॥ సుజాత, యం.ఎ., గారితో 27.2.1994వ తేదీన చిలకలూరిపేటలోని శ్రీ వెంకటేశ్వర కల్యాణ మంటపములో వైభవంగా జరిగింది.

గుంటూరుజిల్లా నర్సరావు పేట పుర ప్రముఖులు శ్రీ పెనుగొండ వెంకటేశ్వర రావు గారి కుమారులు చి॥ ప్రతాప్, యం.ఎ., గారి వివాహం, విజయవాడ శ్రీ పరుచూరి పూర్ణ చంద్రరావు గారి కుమార్తె చి॥ సౌమ్య, బి.కాం., గారితో 4.3.94వ తేదీన విజయవాడలోని సోషల్ క్లబ్ అండ్ లిటరసీ సొసైటిలో వైభవంగా జరిగింది.

*గమనిక :— ఈ శీర్షికన ప్రకటన కోవాలను కునే వారు వివాహ శుభ లేఖతో బాటు రూ.116/-లు యం.ఓ. ద్వారా గానీ, డి.డి. ద్వారా గానీ పంపాలి.*

## తెలప్రోలు వెంకటేశ్వర్లు గారికి సతీ వియోగం

విజయవాడ పుర ప్రముఖులు శ్రీ తెలప్రోలు వెంకటేశ్వర్లు గారి భార్య శ్రీమతి లాలమ్మ గారు 4.2.1994వ తేదీన స్వర్గస్థులయ్యారు.

## ఈ నెలలో మీ కర్తవ్యము

(21.3.1994 నుండీ 20.4.1994 వరకు)

1. ఈ (మార్చి) నెల 31వ తేదీతో అంతమగు ఆర్థిక సంవత్సరానికి గాను కొత్త అసెసీలు తమ పర్మనెంట్ అకౌంట్ నెంబరు కొఱకు డూప్లికేట్‌లో పంపవలసిన ఫారము నెం.49ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి ఈ మార్చి నెల 31వ తారీఖు లేదా అంతకులోగా చేర్చాలి–అను అంశాన్ని విస్మరించకండి.

2. మీరు పంపవలసిన A-2 రిటర్న్సును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి పంపుటకు ఈ (మార్చి) నెల 25వ తేదీయే చివరిది–ఈ విషయాన్ని మరచిపోకండి. మీరు పంపు A-2 రిటర్న్సును చలానాతో బాటు కాకుండా చెక్కుతోబాటు పంపాలనుకున్నారా? అయితే ఆ విధంగా A-2 రిటర్న్సును చెక్కుతోబాటు పంపుటను ఈ ఏప్రిల్ 15వ తేదీలోగా చేయాలి.

## వైశ్య ప్రబోధిని యాజమాన్యం, తదితర వివరాలు

### ఫారం 4 (8వ నిబంధన చూడండి)

| | | |
|---|---|---|
| 1. | ప్రచురణ స్థలం | : వాసవీ ప్రింటర్స్, జయనగర్ కాలనీ, కడప. |
| 2. | ఎంత కాలానికి ఒకసారి ప్రచురణ జరిగేది | : నెలకు ఒక సారి |
| 3. | ముద్రాపకుని పేరు | : శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి. |
| | జాతీయత | : భారతీయుడు |
| | చిరునామా | : 'వాసవీ భవన్', జయనగర్ కాలనీ, కడప – 516002. |
| 4. | ప్రచురణ కర్తపేరు | : పై విధంగానే |
| | జాతీయత | : " |
| | చిరునామా | : " |
| 5. | సంపాదకుని పేరు | : పై విధంగానే |
| | జాతీయత | : " |
| | చిరునామా | : " |

పైన పేర్కొన్న వివరములు అన్నియు యథార్థములు.

కడప.
14.3.1994

సం॥ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి
ప్రచురణ కర్త, సంపాదకులు.

తెలుగులో

# కంప్యూటర్ జాతకం

**Rs. 175/-**

మీ భవిష్యత్తును తెలుసుకోండి.

ఎటువంటి పంచాంగమును ప్రామాణికముగా తీసుకొనకుండా పూర్తిగా ప్రాచీన ఖగోళ శాస్త్ర సూత్రాల ప్రకారం, పూర్తిగా అక్షాంశ, రేఖాంశలతో కూడిన బి.వి.రామన్ అయనాంశము ప్రకారము కంప్యూటర్ చే లెక్కించి జాతక చక్రము తయారుచేసి ప్రాచీన జ్యోతిష శాస్త్రము ప్రకారము దేశములోని ప్రముఖ జ్యోతిష వేత్తలచే జాతక చక్ర ఫలితాలను చెప్పబడును.

ప్రతి పూర్తి జీవిత కాలపు రిపోర్టునందు పూర్తి వివరంగా జన్మ నక్షత్రము, జన్మ తిథి, జన్మ లగ్నము, నిత్య యోగము, పాదాలతో వివరించబడిన లగ్నజాతక చక్రము, భావము, నవాంశ చక్రములతో పూర్తి జీవిత కాల (ఇక్కడ ఆయుర్దాయమును పరిగణించటం లేదు.) దశాపహారము పట్టిక, అష్ట వర్గము, నిరయణ స్ఫుటంతో సమగ్రమైన ఫలితాలతో పాటు మీ భవిష్యత్తుకు సంబంధించి విద్య, వ్యాపారము, వివాహము, మొదలగు విషయాలతో కూడిన సమగ్రమైన *18-24* పేజీల కంప్యూటర్ జాతకము కొరకు ఈ క్రింది చిరునామాకు *రు.175/-*లు మనియార్డర్ కాని, డి.డి. కాని, కె.శ్రీనివాసరాజు పేరు మీద కడపలో చెల్లు విధముగా పంపి మీ ఖచ్చితమైన భవిష్యత్తును తెల్సుకోండి.

—— మీరు పంపవలసిన వివరాలు ——

పేరు, పుట్టిన తేది, సమయము, స్థలము (మండలము, జిల్లా)

రు.175/-లు డి.డి. లేక మనియార్డరు

For More Detials Send Your Enquires

**K.S.RAJU ASTROLOGY CENTRE**

Room No.4&5, Haroon Complex, Beside Ramesh Theatre,
Cuddapah

*Computer Images*, CDP

## INDIAS' FINEST SOUND SYSTEMS

- ★ Concessional Price For Temples.
- ★ Free Installation Technical Guidance
- ★ Trouble Free Performance One Year Guarantee




**RADIO'S**
**TAPE RECORDERS**
**TWO-IN-ONES**



**PHILIVISION**
**B&W AND COLOUR TVS**

*Authorised Dealers :*

**M/s. The Gupta Trading Company,**
286, MAIN ROAD,
NANDYAL - 518 501 ✆ : 2276




*With Best Compliments From :*

✆ : 22149

**M/S. Sri Maruthi Finance Corporation,**
(Regd.)



13/218, Upstairs, Mundy Bazaar
**KURNOOL - 518 001**
*[ Andhra Pradesh ]*

